శ్రీ

# సంగీతశశిరేఖ



(5 అంకముల నాటకము.)



గ్రంథకర్త:

అయినాపురపు సోమేశ్వరరాయకవిగారు.








ప్రకటనకర్త:

కొండపల్లి వీరవెంకయ్య

బుక్కు సెల్లర్, రాజమండ్రి.

మొదటికూర్పు 1000.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1927



 [వెల 0_12_0

శ్రీ

# సంగీతశశిరేఖ

5 అంకములు గల నాటకము

ఇది

ప్రమదామనోహరము, సంగీత సావిత్రి, కచ దేవయాని, [illegible]

పుండరీక, సంపూర్ణ రామాయణము మొదలగు నాటకములు రచించిన

## అయినాపురపు సోమేశ్వరరాయకవిగారిచే

రచియింపబడినది.


ప్రకాశకులు:

కొండపల్లి వీరవెంకయ్య,

బుక్కుసెల్లరు, రాజమండ్రి.

మొదటికూర్పు 1000 ప్రతులు.

కాకినాడ.

[illegible]

ముద్రింపబడియె.

1927




[ వెల 0-12-0

# ఈనాటకమునందు వచ్చు ముఖ్యపాత్రలు.



పురుషులు.

దుర్యోధనుఁడు — కౌరవరాజు

కర్ణుఁడు — అంగరాజు

నారదుఁడు — దేవర్షి

బలరాముఁడు — శశిరేఖ తండ్రి

కృష్ణుఁడు —

ఇందుశర్మ — బ్రాహ్మణుఁడు

ఘటోత్కచుఁడు — భీముని కుమారుఁడు

అభిమన్యుఁడు — అర్జునుని కుమారుఁడు

భీష్మద్రోణకృపాశ్వత్థామలు —

ఇంకను సందర్భానుసారముగా రాక్షసులు ప్రవేశింతురు.

స్త్రీలు.

రేవతి — బలరాము భార్య

శశిరేఖ — కథానాయిక

రూపలత, కనకలత — శశిరేఖ చెలులు

సుభద్ర — అభిమన్యుని తల్లి

హిడింబ — ఘటోత్కచుని తల్లి

దేవకీదేవి — కృష్ణుని తల్లి





శ్రీ

# సంగీతశశిరేఖ.

## ప్రథమాంకము.

### ప్రథమరంగము.

స్థలము:—హస్తినాపురములోని దుర్యోధనుని యుద్యానవనము.

[కర్ణ దుర్యోధనులును, నారదుఁడును, ప్రవేశించుచున్నారు.]

నార—(చిఱునగవుతో) దుర్యోధనసార్వభౌమా! నీవనినట్లు నేను కలహభోక్తనేగాని- నిజమున కిందు కలహమునకవకాశమే మున్నది? నీ సుతుఁడుమాత్రము సామాన్యులలో లెక్కింపఁదగినవాఁడా?

చ. తనయుఁడు రాజరాజునకు ధర్మపరాక్రమ, విక్రమంబులన్
ఘనతర సత్యశాంత సుగుణాఢ్య వివేకములందు సాటిలే
దని నుతిగన్న లక్ష్మణున కా శశిరేఖను నిచ్చుటంచు మీ
రనుపమలీలఁబోయి ముసలాయుధు గోరుట దోషమున్నదే?.

కానున్న కార్యసిద్ధికివేల సంశయించుచున్నారో నేనెఱుంగఁ జాలకున్నాను.

దుర్యో—మునిసార్వభౌమా! దోష మున్నదనిగాదు. శశిరేఖను మా లక్ష్మణునకిమ్మని మేమడుగవచ్చును. వారీయవచ్చును. కాని యడుగుటకే నాకు మిగుల మొగమాటముగానున్నది. కారణ మేమందురా?

తే. గీ. ఎల్లవిధముల దగిన మేనల్లుఁడింట
నుండఁగా శశిరేఖ నెట్లొరులకొసఁగ
సమ్మతివహింతు రామ కృష్ణాదులనుచు
సాహసించి యడుగ మది । సంశయింతు.

రామకృష్ణాదులమాట యటుండుచుఁడు. సుభద్ర యూరకొనునా? సుభద్ర విచారమునుగాంచి దేవకీదేవి యూరకొనునా? వీరందఱేకమై బలరాముని మెడలువిఱచి శశిరేఖ నభిమన్యున కిప్పింపరా? ఇందఱ యభిప్రాయమును- ఇందఱ ప్రార్థనమును- ఆబలరాముఁడుమాత్రము ద్రోసివేయఁగలఁడా? అదియునుఁగాక;

సీ. జననమందినదాది । శశిరేఖ తనకోడ
లని మురిసియు సుభద్ర । వ్యధను బెంచి
నాయల్లుఁడనుచు నిన్నాళ్లు బెంచిన ప్రేమ
పుండీవ దృటిలోన । బుణికిప్రైచి
చిన్న పెద్దలు జేరి । చేసెడిబోధనల్
దలకెక్కనీయక కావలకుద్రోచి
అన్నయా! శశిరేఖ । నభిమన్యుకిమ్మను
శ్రీకృష్ణుమాట నిరాకరించి
లోకనిందలనైనను । లోగణింప
కెట్లు మనకోర్కెదీర్పఁగా । నిచ్ఛగించు
నయ్యా! కోరినయంత హాలాయుధుండు
లేనిపోనట్టి యాశయుమానఁదగునె?.

కర్ణు—మిత్రమా! నిశ్చయముగా నీవనినట్లే కార్యమున మనకు బరాభవమేగాని కార్యసిద్ధి కానరాదు. అందుచే మాట్లాడ కూరకుండుటుత్తమము.

దుర్యో—సెబాస్. కర్ణా! చక్కగా బల్కితివి.

నార— అంగరాజా! నీవు గూడ నట్లేయనిన నేను మాట్లాడ లేను గాని—

తే. గీ. తన సహోదరి యగు సుభ । ద్రను గిరీటి
హస్తముల బెట్టకుండంగ । హస్తినాపు
రాధి నాథున కొసగంగ । హలధరుండు
జేసినటువంటి యత్నముల్ । జెప్పదరమె ?

ఎన్ని చేసినను బెద్దలుపై నుండుటచేతను-దైవఘటన మన్యథాయుండుటచేతను శ్రీకృష్ణుడు పాండవ పక్షపాతి యగుటచేతను- బలరాముని యాశయము దీరినది కాదుగాని- లేకున్న సుభద్ర మనదుర్యోధనుని వామభాగ భూషణమై విరాజిల్లవలసినదే గదా? ఇప్పు డతని కట్టియాటంక మేమి గలదు? శశిరేఖ విషయమున నా బలరాముని కంటె బాధ్యతగల వారిం కెవ్వరున్నారు? ఉండుగాక, కన్నతండ్రి కంటె పరులు విధాయకులా? తొలుతనుండియు బలరామునకు దుర్యోధనునిపై యభిమానము మెండుగదా? అట్టియెడ మీ రడుగుటయే తడవుగా నాబలరాముడు డంగీకరించి తీరును.

దుర్యో—మునికులతిలకా! మీచెప్పిన విషయమంతయు సత్యమే. ఆబలరామునకు నాయం దభిమానము మెండు. మాకు గదావిద్యగఱపు నపుడుగూడ- కేవలము మేనత్త కుమారుండగు వడముడి మీదకంటె నాయం దత్యధికమగు ప్రేమను జూపుచుండెడి వాడు. ఇప్పటికిని నాయెడనున్న ప్రేమమాత్రమా మహానుభావునకు దరుగలేదు. అందుచే నాతో వియ్యమునకా సీరిపాణి యనుమతించునను

నాశనాకున్నది గాని- తొలుతనుండియు పాండవ పక్షపాతి యగు కృష్ణుఁడేదియేని యొకయుక్తి బన్ని యీశుభకార్యమునకు విఘ్నమాపాదించి మాకెనలేని పరాభవము గూర్చునేమో యని సంశయించుచున్నాను. కాన నన్నింక బలవంత పెట్టకుఁడు.

కర్ణ — అగునగును. సార్వభౌమా! కృష్ణుఁ డంతవాఁడు మాత్రమగును. ఎరిగియుండియు నలువురిలో పరాభవ మార్జించుకొనుటకై మనము సిద్ధపడుట కంటె మనమా ప్రమేయమునకే బోకుండుటుత్తమము.

తే. గీ. వనజనాభుండు పాండవ । పక్షపాతి
శశియు నభిమన్యునే మన । సా వరించె
రేవతికి మేనటికముపైఁ । బ్రేమ హెచ్చు
యిన్ని యిటులుండ మనకోర్కె । యెట్లుదీరు.

ముందు వెనుక లరయకుండ మనము బోయి యడిగినను- మనయందున్న యభిమానంబు పెంపున నాబలరాముం డంగీకరించినను ఈవివాహము మాత్రము గాదు. ఆయాసము మనకు మిగులును. తలయెత్తుట కవకాశము లేని పరాభవమాజన్మాంతము నిలిచియుండును. కాన మనమా విషయమెత్తకుండు టుత్తమము.

నార — (తనలో)

తే. గీ. పానకములోని పుడకచం । దానఁగర్ణుఁ
డడ్డు బడుచుండ నింక । నాయాశయంబు
దీరు టెట్లు? కలదో? లేదో? । కౌరవుల ప
రాభవముగాంచి ముదమందు । ప్రాప్తినాకు.

కానిమ్ము. ఇంకను బ్రియత్నించి చూచెదఁగాక. (ప్రకాశముగా) దుర్యోధనా ! నీవింతగా సంశయించుట కేమికారణమో నేనూహింపఁజాలకున్నాను. మిమ్ము మోసగించి నేమూట గట్టుకొనున దేమియు లేదు. రత్నమును రత్నముతో జేర్ప వలయుననియే నాయాశయముగాని మఱియొండుగాదు. కృష్ణుఁడు పాండవపక్షపాతియగుగాక. మఱేమగుగాక. ఈ విషయమునఁ గామపాలుఁడు మాత్రము మా కమలనాభుని హితోపదేశ మాలింపఁడు. ఈమాటమాత్రము ముమ్మాటికిని నిశ్చయము. ఒకానొకవేళ మీరని నట్లాహరి యంతగా బలవంతముజేసి తన మాటవినక తప్పదని నిర్బంధించినను

తే. గీ. ఏలుటకు నంగుళం బేని । నేలలేక
నుండఁ గొంపయు దినుటకు । దిండిలేక
వనములందున్న పాండవ । పక్షమూని
బలిమి శశిగొంతుఁ గోయఁగా । వలవదనఁడె ?

ఆమాటతో శ్రీకృష్ణుని వాయి కట్టుబడవలసినదేగదా ? ఇంకేమైన మాట్లాడఁగలఁడా ? మాట్లాడుట కవకాశ మున్నదా ? నిజమున కా బలరాముఁడుమాత్ర మేమిజూచుకొని యభిమన్యునకుఁ దనతనయ నొసంగ సమ్మతివహించును ? బలరాముఁ డంగీకరించునుగాక. రేవతి యంగీకరించుననుకొనుట మౌఢ్యము గాదా ?

ఉ. తల్లి ధనంబు జూచుకొను । తండ్రి వివేకము సత్యశాంతముల్
బెల్లగువిద్య వంశమును । పెక్కుణ సేయును, రూపవంతుకై
తల్లడమందు కన్య- అది । దక్క నిజంబుగ పైగుణంబులం
దల్ల నమీాదు లక్ష్మణున । కా యభిమన్యుఁడు తీసికట్టుగా ?

అంచుచే రేవతి మీసంబంధము మాట విని నచో నభిమన్యుని మా కైన నెత్తదు సరికదా మీవాని కిచ్చువఱకు బలరాముని వేధించుకొని తినును. మీసంబంధమున్నదని వారిదివఱకే యె ఱుంగుదురుగాని "నోరు తెఱచి యడిగినచో మీరేమందురో" యని వారు తటపటాయించుచున్నట్లు నేను వినియున్నాను. మీరొక్కమారు కదపినచో వారి కా సంశయ ముండదు.

క. అడుగుట తడవుగ బలరా
ముఁడు రేవతియును మిగులఁ బ్రి । ముదితాత్ములరై
యొడఁబడి కన్యక నిచ్చెద
దడయక రమ్మనుచు వార్త । తప్పక బంపుక్.

కావున నామాటవిని సంశయింపక కార్యసాధనకై గడంగుఁడు.

కర్ణ—సార్వభౌమా ! ఈమారు నాకు నచ్చినది.

ఉ. నారదమౌని వాక్యములు న్యాయములై గనుపట్టు చుండెనే
నారసిచూడ వేగమె హ । లాయుధు చెంతకు వార్తబంపు, మీ
కూరిమి పుత్రికామణిని । గోడలుజేయుము మాకటంచు, నీ
కోరిక చిత్తబోవునను । కొంట వివేకముగాదు మిత్రమా !

కావున నేఁడే ద్వారకకు మీపురోహితుండగు నిందుశర్మను బం పుము.

దుర్యో—మంచి దట్లనే పంపించెదను. (నారదునితో) మునిసార్వ భౌమా ! వెడలుదము రండు. చెప్పవలసిన నాల్గుమాటలును మీరే యిందుశర్మకుఁ జెప్పి ద్వారకకుఁ బంపించుఁడు.

నార—ఆబరువుగూడ నా నెత్తిపైననే బెట్టితివా ? సరే. నడువుఁడు. (తనలో) అమ్మయ్య ! కృత్యాద్యవస్థమీఁద వీరి నంగీకరింపఁ జేసితిని. ఇంకమీఁద జరుగు చిత్రములను గాంచి యానందిం చి నాత్మనుత్తునే జల్లార్చుకొందుఁగాక.

తే. గీ. హలధరుఁడు కౌరవులకోర్కె । నాదరించు
పాండవుల పక్షమూనును । వనజనాభుఁ
డప్పు డెన్నని చిత్రించు । లవతరించి
పేరికుకులకును నాకును । విందొనర్పు.

కావున నే వేవేగఁజని యిందుశర్మను బలరాముని చెంతకు బంపిం చెదగాక.

1. వ. అనుబంధము.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

ద్వితీయరంగము.

—: స్థలము—ద్వారకలో బలరాముని యంతఃపురము :—

[రేవతీ బలరాము లిర్వురునుఁ గూర్చుండియుండఁగాఁ తెఱ లేచును.]

రేవ—ప్రాణేశ్వరా! క్షమించుఁడు. పరధ్యానముగానుంటిని. మఱల సెలవిండు.

బల — అంత పరధ్యానమేలవచ్చినది.

రేవ—ఇదిగో! ఈ గవాక్షముగుండ మన యుద్యానవనములోనికి జూడుడు. మనశశిరేఖ తన చెలికత్తియలతో నాడుకొనుచున్నది. మన మేనల్లుండగు నభిమన్యుఁడుగూడ నందున్నాఁడు.

బల—వా రప్పుడప్పు డట్లాడుకొనుచునే యున్నారు. అందాశ్చర్యమేమియున్నది?

రేవ—శశిరేఖాభిమన్యు లిరువురాటలలో సైత మొకరియనురాగ మొకరికి తేటతెల్లమగు నట్లాడుకొనుచున్నారో చూడుఁడు. అదిగో! అదిగో!! ఇప్పుడుజూడుఁ డిప్పుడుజూడుఁడు. మనశశి యా

టలో దొంగవై బరువెత్తలేకుంటచే యభిమన్యుఁ డెంతచాతుర్యముగా శశికి పట్టుఁబడెనో గాంచుఁడు. ఆహాహా!

తే. గీ. వారి యనురాగవల్లరి । తీరుగాను
బెరుఁగుచుండె దినదినాభి । వృద్ధియగుచు
శుక్లపక్షంబునందలి । సోముఁడట్లు
కనులకానంద మింకేమి । గలదుమనకు.

అట్టి యానందతరంగడోలికల నోలలాడుచు మీమాట పరధ్యానముగావింటిని. క్షమించి మఱల సెలవిండు.

బల—క్షమించుటకేమిగాని బిడ్డవివాహాయుక్త వయస్కయై యున్నది. ఇంతవఱకు సంబంధమేమియు గుదురలేదు. ఈవత్సరము వివాహముజేసి తీరవలయును. నీవేమందువు?

రేవ—ఇంకను సంబంధము గుదురలేదందురేమి? మన శశిరేఖ నభిమన్యునకిచ్చుట కింతకుమున్ను మీ రనుమతించియే యున్నారుగదా? మఱల నేఁడీసంశయ మెందుకువచ్చినది ?

బల—అన్యోన్యానురాగముగలవారి వివాహ మనుకూలదాంపత్యమంటిని గాని శశిరేఖ నభిమన్యునకొసంగెదనని యంటినా?

రేవ—(సందేహముతో) అట్లయిన శశిరేఖ నభిమన్యునకీయరా?

బల—ప్రియా! నా యభిప్రాయము నీ కెఱుంగఁజేయక పోవుటెంకెందులకు?

చ. ఘనతరవైభవంబునను । గ్రాలెడిరాజ్యము వైరిహస్తమం
దునిచి వివేకహీనులయి । యుండ గృహంబును బండమంచముఁ
దినుటకు దిండియుఁ గనక । దిక్కొకసుంతయులేకకానలం
దున వసియించు పాండవుల । తో మనసొప్పదు వియ్యమందఁగాఁ.

కాని యీ మాటమాత్ర మింతవఱకు బైకనజాలకున్నాను. కారణమేమందువా?

మ. ఇదినాభావమునః సుభద్రివిని యొం । తేచింతచే బొక్కు కు
ట్టది ప్రేమించిన వానికై బొగులు, వా । రట్లుండుటల్ గాంచి నీ
కిది భావ్యంబగునాయటం చనుచు శ్రీ । కృష్ణాదులెంతేని దూ
రుదురేమోయనియెంచి తెల్పుటకునై । లోలోననే జంకితిన్.

సోదరి శోకించుననియు—బంధువులునిర్బంధింతురనియు—తలంచియన్న
మునన్న మెఱుంగనట్టి మన శశిరేఖ గొంతుకనులిమి దుః
ఖసముద్రములో దోసివేయుటకు నామనం బంగీకరింపకుండ
నున్నది. చిన్నబిడ్డవరించినదని దాని క్షేమమేగోరెడి మనము
గూడ నట్లాచరింపదగునా? తరువాత బిడ్డ కష్టపడుచుండ
చూడగలమా?

రేవ—అయ్యయ్యో! నోటికిని చేతికిని యెంగిలిలేనిసంబంధమనియైన
నోచింపవలదా?

బల—నోటికిని- చేతికిని- యెంగిలిలేనివారు గావుననే మనకొంపకుఁ
జేరిరి. ఆవిషయమాలోచించియే మనసు ద్రిప్పుకొంటిని.

రేవ—సంబంధ మెఱుమఱికలేనిదని నాయభిప్రాయముగాని వారన్న
మునకు లోపమున్నవారని నాయభిప్రాయముగాదు.

బల —అన్నమునకు లోపమున్నది గావున నే-పాండవులంటి సంసారము
భస్మమగుటయు పొలతులు పుట్టినిండ్లకును-పతులు వనముల
కునుఁ జేరిరి. అట్టియెడ:—

తే. గీ. ఎఱుమఱిక లేని బాంధవ్య । మిదియటంచు
బిడ్డనభిమన్యుచేతిలో । బెట్టుకొంటె
ప్రాణములు దీసివైచుట । భావ్యమగును
పాము తనసంతు దామింగు । పగిదిగాను.

రేవ—పాపము శమించుఁగాక. పాపముశమించుఁగాక. హర. హర.
ప్రాణేశ్వరా! నేఁడిట్టి విపరీతపుమాటలాడుచుంటిరేమి?

బల ... విపరీతమున కేమున్నది?

ఉ. కూటికిఁగూడ లేకునికి। కుఱ్ఱనితో మనకొంపఁజేర మో
మోటమిపీడి, సిగ్గువిడి। ముల్ విడనాడి సుభద్ర, దానితో
బాటుగఁ బొట్టకూటికయి। బానిసవృత్తిఁ జరింపఁ బాపు మీ
పాటికిబిడ్డనంచు బల। వంతము జేయుదు వేమి పాపమే.

రేవ—నాథా! కష్టము లెల్లకాలమిల్లుగట్టుకొని కాపురముండునా? ధర్మపరావతారులగు నా పాండునందను లరణ్యవాసానంతర రమున నజ్ఞాతవాసముగూడ ముగించి రాజ్యము బడయకూరకుందురా? అప్పుడు మావదినె మాయందఱకంటె నెక్కుడుగా సుఖింపకుండునా? కష్టకాలమున బుట్టింట తల దాచుకొనుటకు సిగ్గెందులకు? మోమోటమెందులకు? ప్రాణేశ్వరా! మీతో నేను వాదింపఁజాలనుగాని నాదొకమనవి. మనబాలికవిద్యావతి. యుక్తవయస్క. సదసద్వివేకశాలిని. ఆమెది తుచ్ఛమోహముగాదు. అభిమన్యుని గుణగణంబుల కామె మేలుపడియున్నట్లు గాన్పించుచున్నది. ఇట్టి సందర్భమున నామె యభిప్రాయమును దీసికొనకుండ త్వరపడి పైసంబంధమును గుదుర్చుటయే త్వరపడి యామె కుత్తుక తెగియుండె గని అంపముతోఁ గోసి నట్లగును. కలిమిలేములు కావడికుండలవంటివి. అభిమన్యుని కొక్క ధనాభావము దప్ప ని కెట్టి లోపమును లేదు. మఱిదిగారి కా పాండవులపై ప్రేమ హెచ్చు. ఆయన యనుగ్రహమున్న వారి కైశ్వర్యము బట్టుట కెంత గావలయును. ఆపదలు దొలఁగుట కెంతగావలయును. నిజమున కభిమన్యునివంటి సుగుణసంపత్తిగలవాఁ డింకొకఁడు లేఁడు. అట్టివాఁడు మనకు దొరకుట దుర్లభము. నామాట వినుఁడు. పోనీ యీవిషయమున నీయభిప్రాయ మేమని- అ

త్తగారిని, మఱదిగారిని గూడ బ్రశ్నించి చూడుఁడు. వారి యభిప్రాయ మెట్లుండునో కనుఁగొనుట మంచిది కాదా ?

బల—సుభద్రా వివాహవిషయమునఁగూడ నిట్టి రాద్ధాంతసిద్ధాంతములైనవి. అప్పుడు నే నొక్కరుఁడనే వ్యతిరేకాభిప్రాయము గలవాఁడనైతిని. దాని వివాహవిషయమున నే నస్వతంత్రుఁడనై పోతిని గావున నోరుమూసికొని యూరకుంటిని. ఈ విషయమై యొరులతో నాలోచింపవలసిన పని లేదు. స్వయముగా నేనే సంబంధము నిశ్చయించితిని.

రేవ—(ఆశ్చర్యముతో) ఏమి ? సంబంధ మప్పుడే నిశ్చయము జేసివైచితిరా ?

బల—ఆహా ! సంబంధము స్థిరపఱచుటయు, తాంబూలములు బుచ్చుకొనుటయు, ముహూర్తము నిశ్చయించుటయు గూడనైనది.

రేవ—బిడ్డతోనైన నాలోచింపవలదా ?

బల—ఆలోచింపవలసిన యగత్యము లేదు.

రేవ—ఏసంబంధము నిశ్చయించితిరి ?

బల—నాశిష్యుండును, హస్తినాపురాధినాథుండు నగు దుర్యోధనుఁడు తన కుమారుఁడగు లక్ష్మణునకు మన శశిరేఖ నిమ్మని పురోహితుండగు నిందుశర్మను బంపించెను. నేనా సందేశమాలించి యెంతయో సంతోషించి యాతని చేతనే ముహూర్తమును బెట్టించి లగ్నపత్రిక నొసంగి బహూకరించి యావిప్రపుంగవుని బంపించితిని.

రేవ—కట్టా ! ఎంతపనిచేసితిరి.

[అప్పుడు శశిరేఖ ప్రవేశించుచున్నది.]

శశి—(చటాలునఁ దల్లియొడిలోఁ గూర్చుండి) అమ్మా ! గుజ్జనగూళ్లు వండుకొని బొమ్మల పెండ్లిండ్లు జేసికొనవలయునని యున్నది.

చెలికత్తియ లెల్లరును ముస్తీబై వచ్చుటకు వెడలిరి. నాభూషణములును, బావ పచ్చలపతకమును నీపెట్టియం దున్నవీ యవా ?

బల—అమ్మా ! బావకూడ మీతో నాడునా ?

శశి — ఔను. మేము మగపెండ్లివారము. కనకలత యాడుపెండ్లివారు.

బల—అమ్మా! నీవు యుక్తవయస్కురాలవైతివి. ఇంక పురుషులతో నాటలుకూడదు. ఈ దినముమొద లెన్నఁడును మీమేనబావతో నీ వాడవలదు. అతని యెదుటఁ బడవలదు. ఆతనితో మాట్లాడవలదు.

శశి—(తల్లియొడినుండి దిగి నిర్ఘాంతపోవును.)

బల—(శశిరేఖను దగ్గఱగాఁ దీసికొని లాలించుచు) నిర్ఘాంతపడిపోయితివేమమ్మా! స్త్రీలు పరపురుషుల ననవరతమును జూడ రాదుగాన నట్లంటిని. నీవింకమీఁద నీ బావను మఱచిపోవుట కలవాటుచేసికొనవలయును. నీ కింకొక వారముదినములలో వివాహము గాఁబోవుచున్నది. హస్తినాపురపు యువరాజున కర్ధాంగలక్ష్మివి కాఁబోవుచున్నావు. నీవు నీ యత్తవారింటికి వెడలినపిమ్మట నాకస్మికముగా నీ బావను మఱచుటనిన నీకుఁ గష్టము. కావున నిప్పటినుండియు నలవాటు జేసుకొనిన నప్పుడా బెంగ నీ కేమియునుండదు.

శశి — (పొరలి పొరలివచ్చు దుఃఖముతో దల్లిచెంత కరుగుచున్నది.)

రేవ—(దుఃఖమాపుకొని బిడ్డ నక్కునజేర్చుకొని) అమ్మా! విచారింపకుము. దైవయోగమున కెవ్వ రేమిచేయఁగలరు? ఆదుర్యోధనుని కుమారుండగు లక్ష్మణుండైవను సుగుణసంపత్తిగలవాడ

నియే వినియున్నాము. నీ భావియదృష్ట మెట్లున్న నట్లగును. ఇప్పటినుండియు విచారమెందులకు?

శశి—(వెక్కి వెక్కి యేడ్చుచు) అమ్మా!........ఆ...నీ...తి...బా...హ్యుని...కుమారు—అర్ధోక్తిలో—

బల —సకలగుణసంపన్నుండగు దుర్యోధనుఁడు నీతిబాహ్యుఁడా?

శశి—నీతిబాహ్యుఁడని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. ఒక పతివ్రతాశిరోమణిని దన యూరుభాగంబునఁ గూర్చుండుమని సౌంజ్ఞయొనర్చిన దౌర్భాగ్యుఁడు నీతిబాహ్యుఁడు గాక నీతిమంతుఁ డగునా?

బల —ధర్మాధర్మములును, నీత్యవినీతులును నాకంటె నీ కెక్కువ తెలియునా? కన్నతండ్రి నిన్నన్యాయము జేయుననుకొంటివా? మేము నిశ్చయించిన సంబంధ మన్నివిధముల సర్వోత్తమమైనది. ఈ సంబంధమును జేసికొనుటకు సిద్ధముగానుండుము. ఇదిగో! నీ కాబోవుమగని చిత్రపటము. ఈతఁడు సురూపసుందరుఁడు. మదవతీమన్మథుఁడు. తండ్రికంటె వేయిమడంగుల—అర్ధోక్తిలో—

శశి—అవినీతిమంతుఁడా?

బల—(కోపముతో) అవిధేయురాలి కవినీతిమంతుఁడు భర్త కాఁగూడదా?

శశి—(విచారములో) జనకా! ఇంతకాలము నీవు నన్నే నేకవిధముల లాలించి పెంచి, పెద్దదానినిజేసి, నేఁడు నా కంగీకారములేని వాని నుద్వాహమాడననుటచే నవిధేయురాలనని నిందించుచుంటివా? ఆజన్మకాలసౌఖ్యమున కశనిపాతమువోలె నడ్డుబడుచున్న నీ విపరీతపుబెండ్లి నా కక్కఱలేదనుట దోషమా? నా పెండ్లివిషయమై నాకు స్వాతంత్ర్యములేదా? నా సౌఖ్య

ము నేను జూచుకొనుట సభ్యమా? సౌఖ్యములేని సంబంధము నాకు వలదని మీతో మొఱబెట్టుకొనుటయే యవిధేయత్వమైనచో బ్రిపంచమున నింక విధేయమ్మగాని దేమున్నది? ఆడుబిడ్డ కావునాత్రిపు స్వాతంత్ర్యము లేకున్న ప్రాణసంకటము గాదా?

రేవ—ప్రాణేశ్వరా! ఇంతమాత్రమున నా బిడ్డను నిందించుట భావ్యముగాదు. అమ్మమారుటకు సిద్ధముగానున్నప్పు డామె యభిప్రాయమును విన్నవించుకొనుట దోషముగా బరిగణింపరాదు. ఆమె విన్నపము మనమేవినకున్న నింక వినువారెవ్వరు?

శశి—జనకా!

మ. తలిదండ్రుల్ బరమేశుతుల్యులని స్వాంతంబందు నే నెంచి మిమ్ములమన్నించుచు, మీదునాజ్ఞలసదా మూర్ధంబునన్ దాల్చిమిమ్ముల సంతోషసుఖాబ్ధిదేల్చుసుతకున్, మోదంబుగానట్టి పెండిలి జేయన్ సమకట్టధర్మమగునే నిన్నోల్బెలు సుజ్ఞానికిన్.

బల—శశిరేఖా! నా యిష్టమువచ్చినట్లు నే నాచరించితిని. మంచియో చెడ్డయో లగ్నపత్రికగూడ బంపించివైచితిని. ఆదిగాదనుట కింకిప్పుడేవిధమైన యవకాశమును లేదు. ఆవిషయమున నీవింకేమియు నోరెత్తవలదు. ఇదిగో! నీ మనోనాథునిపటము. దీనిని గైకొని లోనికి బొమ్ము. అధికప్రసంగమొనర్పకుము.

(అని పటమొసంగును.)

శశి—(గైకొని చింపి బలరాముసిపాదములచెంత బారవైచి నిష్క్రమించును.)

[అప్పుడు రెండవవైపునుండి విచారముతో సుభద్ర ప్రవేశించుచున్నది.]

సుభ—(కన్నీరు దుడిచికొనుచు) సోదరా! సోదరా!! ఇదేటి యన్యా

యము. ఇన్నాళ్ళు నా కెంతయో బాసగొల్పి నేఁ డిట్లుచే
యుట నీకు భావ్యమా?

సీ. అభిమన్యు శశిరేఖ । లా బాల్యమునుండి
తలఁగుమైత్రి ... దలఁపఁబోక
మా... । మన్యు
బలుమారు ...
అల్లుఁడైనను మేన । యల్లుఁడైనను వెడె
తరుణిరో మనకంటెఁ । దలఁప
తోడఁబుట్టువు చాల । దుఃఖించు నద్దానఁ
గలుగదు జయమని । తలఁపఁబోక
బావమఱఁదులపైనైనఁ । బ్రాఁతిలేక
కన్నపుత్రిక పైనైనఁ । గరుణలేక
సిరులు సుస్థిరమంచును । గరముసమ్మి
తనయ నొకవారికీయ వా । గ్దానమిడితె?

బల — అగును. నాకూతు నాచిత్తమువచ్చినవారి కిచ్చుకొందును. అం
దులకు నీయాటంక మేమి?

సుభ — నీబిడ్డగావున నీచిత్తమువచ్చినట్లు జేసికొనవచ్చును. అందులకు
నాయాటంక మేమియు లేదు. కాని యీకార్యమువలన సుఖ
పడునది నీతనయగావున- ఆమె యవివేకురాలుగాదు గావున-
ఆమె కేమార్గము సౌఖ్యప్రదాయకమని దోఁచునో యామా
ర్గమున కాటంకము గలిగించుట మీ బోంట్లకు భావ్యమా?

బల — నా కార్యాతంత్రము తెలియదా? నిన్నీవిషయంబున జెప్పుమని
బొట్టు పెట్టి పిలిచితినా?

సుభ — ఎంతమాట. నీవు నన్ను బిలిచితివంటినా? నాదుఃఖము వెళ్ళ
బోసికొన నేనే వచ్చితిని. శశిరేఖ నభిమన్యున కిచ్చెదనని నీ

వనేకమారు లనియుంటివి. వారిరువు రాటలలో సైత మొకరి నొకరు ప్రేమించుకొనిరి. ఆసంగతి నీవిదివఱకే కనిపెట్టియుంటివి. అట్టివారి ప్రేమనైనను గణింపక నీవి ట్లన్యాయమును జేయఁగడంగఁదగునా? మా యభిమన్యునికంటె దుర్మదాంధుండగు దుర్యోధనుని పుత్త్రుఁ డెక్కువవాఁడా?

బల—ఓ యవివేకురాలా!

చ. సిరిచెడి మాగృహంబునకుఁ । జేరినదానవు చేరినట్లుగా
నురవడి యొక్కమూలఁ బడి । యుండక నోటికివచ్చినట్టుగా
ద్వరపడి బల్కుచుంటి విది । ధర్మమె? సైపఁగలేనుజుమ్మి యా
కరిపురనాథు పుత్త్రునటు । కారులు బ్రేలుచు నిందఁజేసినన్.

నీవు నాసోదరివని యింతవఱకోర్చితినిగాని యింకొక్కమా రాతనిని నిందించినచో నీయెడలనున్న నాయభిమానముగూడ బోవలసి వచ్చును. అంతవఱకు రాకుండగ మా మర్యాద మాకునిలువంబెట్టి నీమర్యాద నీవు దక్కించుకొమ్ము. ఓ యవివేకురాలా! మీ కేమున్నదని మీయభిమన్యునకు మాశశిరేఖ నిమ్మందువే?

సుభ—సోదరా! సోదరుఁడవని యాపత్కాలమున నీచెంతకు వచ్చినందులకు బాగుగా బుద్ధిసెప్పితివి. తొలుతనుండియు గౌరవపక్షపాతివైయున్న నీ కంటికిప్పుడే నగుపింతునా? నాఁడు నీవేమంటివి? శశిరేఖ నీకోడలని నీ వనలేదా? అనినప్పుడాస జనింపకుండునా? మేనఱికమన్న ముచ్చట యుండదా? అట్టి నాముచ్చట యంతయు గంగపాలుజేసి నావంశోద్ధారకురాలిని నీచహృదయుండగు దుర్యోధనుని పుత్త్రుని కొసంగఁదలంచుట నీకు క్షేమము గాదు. సిరులు శాశ్వతముగాదు. ఆలోచించుకొమ్ము.

బల — సుభద్రా! నీయవివేకమును గాంచి సోదరీ యని పిల్చుటకుగూడ సిగ్గుపడుచున్నాను. మా గడప దాటినచో నీవును నీసుతుండును బిచ్చమెత్తుకొన వలసినదేగాని వేఱొక్కయాధారమును లేదుగదా? నీవు బిచ్చమెత్తుకొనునది చాలక మా శశిరేఖచేగూడ బిచ్చ మెత్తింపఁదలంచితివా? ఓదురాశాపరురాలా!

తే. గీ. కండచక్కెర పాలుమీఁ । గడయుఁ గలుఁగ
గంజికై ప్రాకులాడెడి । కరణిగాఁగ
ధారుణీశునికోడలి భాం । ధవము విడచి
యెవఁడొ బిక్షాధికారి భాం । ధవము గోరు?

అదియునుంగాక —

కం. కోడలు కోడలటంచును
జేడియ వాపోవనేల? । చెప్పుము నీకే
కోడలువచ్చిన నెచ్చట
వేడుకమీఱఁ గృహప్ర । వేశము జరుగున్.

ఈయొక్క ప్రశ్నమునకు సమాధానమిమ్ము. నాకు నచ్చినచో నా పేరిగు నీమెడను వైచెదను. సమాధానము జెప్పలేవా నోరు మూసికొని యావలకు బొమ్ము. నన్ను నిందింపకుము.

సుభ — సోదరా! నీవు నన్ననరానిమాట లనుచుంటివి. అనుము. పడ్డవారెప్పటికిని చెడ్డవారు గారు. ప్రస్తుతము నేను సిరిచెడి, యుండఁ గొంపయుఁ బండ మంచమునుఁ గట్ట గుడ్డయు లేకనే నీ పంచఁ జేరితిని. నేనుఁగూడ మహదైశ్వర్యముతో నిన్నటి సాయంత్రమువఱకున్నదాననే. మఱల తేపటినుండి యట్టైశ్వర్యములతో దులదూఁగవలసినదాననే. నేఁటి కష్టములు నేఁటివలెనే యాజన్మకాలము నుండునా? కష్టము లిల్లుగట్టు

కొని కాపురం బుండునా ? అట్లుండుటయే తటస్థించె నేని లో కము లాగునా ?

తే. గీ. కలిమిలేములు కావడి । కడవలన్న!
సిరియులేమియు వెన్నెల । చీకటులటు
వరుసనొకదాని వెంబడి । వచ్చునొకటి
నేఁటిస్థితి గాంచి మురిసియుట । దేటిసీతి ?

నేఁడు మావానికన్నిటను లోపము గలదుగాని- తొపటి కాలోపము లన్నియుఁ బూర్తియగును. ఎట్లందువా ?

సీ. చిన్నపెద్దలనెల్ల । చిందులు ద్రొక్కించు
శ్రీవల్లభుఁడుగదా? । చిన్నమామ
ఆతని పర్యంక । మై యాతపత్రమై
వెలయువాఁడేగదా? । పెద్దమామ
భుజబలవిస్ఫూర్తి । పూర్ణంబుగాఁగల్గి
యున్నవాఁడేగదా? । కన్నతండ్రి
ఈరేడులోకంబు । లెత్తివచ్చిన బోర
దగువారలెగదా'? పె । దపినతండ్రి
లట్టియభిమన్యునకు లోప । మెట్టిదన్న!
వానికీడౌన కరిపుర । స్వామిసుతుఁడు
నేఁడుతిన్నది తిం?సియు । నేఁడుదాల్చు
బట్టబట్టయుఁ గాదన్న । పలుకు వినవె?

అగ్రజా! నీవెన్నివిధముల నన్ను దూఱినను మేనరికము జేసికొన వలయునను ముచ్చట నాకు మిక్కుటముగా నున్నది. అట్టి నాయాశాలతను నీ నిర్దయావాక్య కుఠారముచే నొక్క పెట్టునఁ గొట్టివైచి నన్ను దిక్కులేనిదానినిగాఁ జేయకుము.

బల—సుభద్రా! నీ నిందావాక్యములతో నాకుఁ బనిలేదు. నీ దీనా

లాపములతో నాహృదయము గలుగదు. నీవనినట్లు మీ యభిమన్యునితో మాలక్ష్మణుఁ డీడుగాఁడు. కావుననే లక్ష్మణుని నాజామాతఁగాఁ జేకొనఁదలంచితిని. ఇఁక నాహృదయాభిప్రాయ మెన్నటికిని మారదు. నీవు నన్ను వేధించుకొని తినక- యడియాసలకుఁ బోవక- లేనిపోయి యల్లరులోనర్పక నన్ను నలువురిలోననుఁ బెట్టి- నీవు నలువురిలోననుబడక నోరుమూసుకొని మర్యాదగా నావలకుఁబొమ్ము. మాశశిరేఖ నీకు గోడలుగాదు. దుర్యోధన సార్వభౌముని కోడలు. లక్ష్మణుని యర్ధాంగి. కరిపురపు యువరాజ్ఞీమణి. పరమేశ్వరవిలాస మట్లున్నది. దానియదృష్టము బాగున్నది గావుననే దానికట్టి సంబంధ మయాచితముగా లభించినది. నీసుతుసఁ గట్టుకొన్నచో దానికట్టి యాధిక్యత లేమియు లేవు సరిగదా మీదుమిక్కిలి యరణ్యవాసమో- పుట్టింటినివాసమో లభ్యమగునుగాని సుఖజీవనము గలుగదు. ఈయుదంత మాద్యంత మాలోచించియు కండ్దార పీకుస్థితి గాంచియు- నాపుత్రిగొంతుకఁ గోయుటకు నేను బాల్పడఁగలనా? పోనీ యింకెందులకు? నీవది వెగారి యభిప్రాయ మెట్లుండునో గనుఁగొనరాదా?

సుభ—పతివ్రతా శిరోమణియగు మానదినిగారు తమ కష్టములేకున్నను మీయిష్టమున కడ్డుబల్కఁగలరా? అట్లు బల్కుట పతివ్రతా ధర్మమగునా? కావున నీవే నాయెడ దయజూడవలయును. నాయిష్టమున కాము వ్యతిరిక్త మెన్నఁటికిని జూపదు.

బల—అట్లయిన వృధాప్రయాసపడక పొమ్ము. ఇఁక నీవు నన్ను బాధింపవలదు.

ధ్రువకోకిల. కుడువఁగూడును కట్టగుడ్డయుఁ । గూడ లేకదరిద్రుఁడౌ
కొడుకుప్రక్కకు భార్యలేదని । గుండనేఁటికి జేల్చవై

పడతిరో! యిటువంటివానికి । భార్యయొక్కతె లోపమే
విడువుమీ యిటువంటికోరిక । వెఱ్ఱివై వెతఁజెందక౯.

సుభద్రా! నన్ననవరతము వేధించుకొనితిరిగినను లాభము లేదు. నా నిశ్చితాభిప్రాయ మెఱింగించుచుంటిని వినుము.

మ. బలవంతంబది యొంతజేసినను నర । బ్రార్థించినన్ దిట్టినన్
గలబంధుల్ దలితండ్రిలున్ హితులు కృష్ణాదుల్ సదా నీపయిన్
గలప్రేమంబున నన్ను దూఱినను ని । ష్కార్యంబు గావింతు ని
శ్చలభావంబున దాని మాన్పుటకికన్ । సాధ్యంబుగాదేటికిన్.

కావున నన్ను బాధింపక నీకిష్టమువచ్చిన సంబంధ మింకొకటి చూచుకొని నీకుమారున కుద్వాహంబు గావించుకొమ్ము. తలకుఁదగని పోకడలు బోయినచో నీకేమిలాభము? ఒక నిర్భాగ్యుని వరించి యాజన్మకాల దుఃఖంబు లనుభవించుటకై మాశశి నాగర్భమునం దుద్భవించినదని యనుకొనకుము. మర్యాదగా జెప్పుచుంటిని. నాసమక్షమున నుండి యావలకుఁబొమ్ము. నాకు కౌరవులతోనున్న లాభము పాండవులతో లేదు. అందుచే నేను నీసుతునకు నాబిడ్డ నీయను.

సుభ — (ఏడ్చుచు) సోదరా! అల్లేపోయెదను. నాకింక నిందేమి యున్నది? సోదరియను నభిమానమునుఁడి- సోదరిననరాని మాటలనుట దోషంబను చింతలేక- గౌరవ ప్రిపత్తులు విడచి- యనరాని మాటలనిన నీపంచనిఁక నిల్చుట మానవతికి మర్యాదగాదు. నాకుమారునకుఁ బెండ్లిగానప్పుడు నేనాలోచించుకొందును. చంచలంబులగు సంపదల కాసించితివి గావున కౌరవులతోడి సంబంధమే జేసికొనుము. ఈసమయంబున నీ కెఱుంగఁ జేయవలసినవిషయ మొక్కటెఱింగించి యాపైన బోయెదను. పాండవ ప్రతిజ్ఞావాక్యంబు లీవెఱుంగనే యెఱుం

గుదువు. ఆప్రతిజ్ఞా నిర్వహణార్థమై యజ్ఞాత వాసానంతరంబున ధర్మతత్పరుండైన ధర్మజు నాజ్ఞఁబొంది—

మ. గదతో భీముఁడు గాండివంబుగొని నా । కొంతుండు శ్రీపార్థసా
రథియై శ్రీపతియున్ గవల్ బహుళ శస్త్రాస్త్రంబులన్ దాల్చియా
కదనక్షోణిని జొచ్చినంతటనె నీ । కాఁబోవు వియ్యంకుఁ డా
పదలంకున్ బడఁగాంచి ఖేదపడుటే । బాంధవ్యలాభంబగుఁ.

అటుపైన —

మ. గురుఁడున్ గర్ణుఁడు కౌరవాదికురుము । ఖ్యుల్ జేతఁ గానట్లు సం
గర రంగంబున తీక్ష్ణఘాతముల నీ । కాఁబోవు జామాత దు
ర్మరణంబుఁ గనఁజేసి మీఁదు శశికిఁ । మాంగళ్య విచ్ఛేదముఁ
జరుపఁ బోమొడి నాదుపుత్రుఁగని చింతం బొక్కెదో సోదరా!

శ్రీకృ—(శీఘ్రముగాఁ బ్రవేశించి) ఆఁ. ఆఁ. సోదరీ! నీ కిట్లాడుటకు నోరెట్లు వచ్చెను. శశి నెంతయో ప్రేమించితివే. దానితో డిదే లోకమని మురిసియుచుండెడిదానవే. కోడలు కోడలని మిగుల గారాబముతో జూచుకొనుచుంటివే. ఎట్లయిన నీ యన్న లనుగ్రహము సంపాదించుకొని- ఇదివఱకున్న యను బంధమునకు దోడింకను మన యనుబంధము ను బెంచి- నీ పేరుగు మామెడనువైచి- మాయనుగ్రహమునకు బాత్రురాలవై- మాచే నీవైరినిర్మూలనం బొనరించుకొని- నీభర్త తోఁబాటు నీవును సుఖింపవలయునని యాసతో మాయం డఁ జేరినదానవు- మమ్మే శపించుచుంటివా? మాకే యాపదలు గోరుచుంటివా? నీకిది భావ్యమా? మాయన్న శశి నీయననినంత మాత్రమున నిజముగా నీయఁడనియే తలంచితివా? అతఁ డనినట్లా శశి నన్యాక్రాంతము జేయదలంచి నచో మేమందఱ మూరకొందుమనియే భావించితివా? మా

ప్రార్థనమును మాయున్న నిర్దాక్షిణ్యహృదయుఁడై త్రోసి
వేయుననియే తలంచితివా? ఇంత నెట్టిదానవేమమ్మా!

**సుభ** — చిన్నన్నయ్యా! (ఏడ్చుచు)

2. వ. అనుబాధము.

అన్నిముచ్చటలు నైనవి. సమస్త ధర్మాధర్మ సంవేదియైన పెద్దన్న నన్ననరానిమాటలని యనేకవిధముల బరాభవించెను. ఆతని కది భావ్యమా? నేను తలఁగొట్టుకొని యాతని పాదముల చెంతఁబడి చచ్చినను సైపఁగలఁడట గాని- తనబిడ్డను నా సుతున కడుగుట విని సైపఁజాలఁడఁట. మేనత్తిక మనుగుటకు నాకు స్వాతంత్ర్యము లేదఁట. ఆమాట నేననరాదఁట. తా వినరాదఁట. పౌర్వాపర్యము లాలోచింపక నేనడిగినను నా యవివేకమున కాతఁడు చింతించునఁట. అన్నగారెన్నియన్నను నాకేమిలోపమని నే నాతని ననేకవిధముల బ్రార్థించితిని. బ్రతిమాలితిని. తీక్ష్ణములగు వాక్యశూలములచే నన్ను నొవ్వఁజేసినను నిండుమనంబున భరించితిని. నాసుతుఁ డధముఁడంట. పనికిమాలినవాఁడఁట. నిర్భాగ్యుఁడఁట. కూడు గుడ్డలకు మొగమువాఁచి తనకొంపకుఁ జేరినాఁడఁట. నే నెన్నివిధముల బ్రార్థించినను నాతని దొక్కటే మొండిపట్టు.

మ. పనిలేదంట చిరస్థమై వెలయు సంబంధ ప్రమేయంబుతోఁ
బనిలేదంట కులంబుతోఁ బరువుతో । భాషావిలాసంబుతోఁ
బనిలేదంట యశస్సుతో గుణముతో । బ్రజ్ఞావిశేషంబుతో
ధనమే శాశ్వతమంట దారుణముగా।దా? యట్లు లూహించుటల్.

నే నెన్నివిధంబుల దన్ను బ్రతిమాల గడంగితినో- యంతను వేయి విధములుగా నన్ను నిందింపఁజొచ్చెను. ఇంక నే నేమిచేయఁ గలను?

మ. విధిగా ద్రవ్యమె బంధువంట యదియే । విజ్ఞానమున్ గూర్చునం
టదియే గౌరవమిచ్చునంట యదె సౌఖ్యంబుల్ వెసన్ గూర్చునం
టదియే ప్రజ్ఞయొసంగునంట యదియే । యన్నింటికిన్ మూలమం
టదియే ముఖ్యమటంచు లోఁదలఁచు టన్యాయంబుగా సోదరా !

తనబిడ్డ గావునఁ దన చిత్తమువచ్చినట్లు చేసికొననిమ్ము. అందుల కెవ్వరాటంక బరుపఁగలరు? ఆటంకపరచినచో లాభ మే మున్నది? మేనత్తకొమరు కాసపడి యడుగుట నావంతు. ఇష్టమున్న నీయవచ్చును. లేకున్న నీయనని నిష్కర్షగాఁ జెప్పవచ్చును గాని- సోదరీమణిని ధర్మాధర్మ వివేకహీనుఁడై నిందించునా? నన్ను నిందించు టాతనికిఁ దగునా? తన పుత్రియే గాని నాసుతునకు గతిలేదా? గతి లేకపోవుగాక. ఘోటకబ్రహ్మచారియై పడియుండుగాక సైపఁగలఁ గాని- వివేకహీనుఁడై నోటికొలంది లాడిన విని సహించుట కష్టము గాదా?

బల—సుభద్రా! ఉన్నవియు లేనివియుఁగల్పించి- నాపై నేరారోపణ మొనర్చి శ్రీకృష్ణునితోఁ జెప్పినంతమాత్రమున భయపడుదు ననుకొంటివా? నీ యిష్టమువచ్చినట్లు నన్ను నిందింపుము. నీ మాటలు నేను లెక్కసేయను. తాటియాకుచప్పుళ్ళకుఁ గుందేళ్లు బెదరుననుకొంటివా? నీవు నాబిడ్డ నె ట్లడుగుచుం టివే మూఢురాలా? నీ కేమున్నదని పిల్ల నిమ్మందువే.

సీ. విధిలేక నీయు త్త । విదురునింటనుఁ జేరి
పొట్టకున్ బట్టకున్ । మొగమువాఁచి,
నీ బావమఱదులు । నీభర్తయుం గూడ
కాననోనుండి రా । కలము దినుచు

పుట్టింట గతిలేక । పోవుటః ద్రౌపది
నడికాన నిడుమలః । బడుచునుండ
నున్నవారల మాట । నిన్ను నీపుత్రుని
దయయొడ బోషింప । దలఁచినాము

ఏమియు బొమ్మన్న దిక్కులేక । యింతలేక
సౌఖ్యపడి కష్టములు బడ । జాల కెందొ
ఘోరమరణంబె స్థిరమని । కుమిలి కుమిలి
యేడ్చవల గాని కోడలి । కేస్తువేల ?

మాకృష్ణుఁడు మాత్రము మాక్షేమంకరుఁడు గాడనుకొంటివా ? ఆత నికి శశిపై నభిమానము లేదనుకొంటివా ? ఆతఁడుమాత్ర మీవిషయ మెట్లు నిర్ధారించ ననుకొంటివి ? నీయొక్క నాఁటి యేడ్పుజూచి సహించుటయే గష్టమైన- ఆజన్మకాలమును నాపైఁబడి యేడ్చు మాశశి దుఃఖమును గని సహింపఁగలనా?

కృష్ణు——అగ్రజా! తప్పు. తప్పు. నీ విప్పు డిట్లామెను నిందించుట కేమి యగత్యమువచ్చినది. ఆమెకిప్పుడు వచ్చిన లోపమేమున్నది? అజ్ఞాతవాసానంతరమునఁ బాండవుల ప్రజ్ఞావిశేషంబులఁ గాంచి సంతసింతువు గాని యంతవర కోరిమివహింపుము. ఆకొన్నసింగంబులవలె కౌరవులపైఁబడి పీల్చి పిప్పిజేసి- వారిరూపుమాపి- రాజ్యముబడసి సర్వ దిగ్విజయమును బాండవులు గాంతురు. కౌరవులు దుష్టమార్గానువర్తనులు. నీకు నిజమె చెప్పుచుంటిని. దైవము వారిపక్షమైయున్నవాఁడు. సత్యదేవత వారికి జేయూతనొసంగుచున్నది. కౌరవుల పాపవృక్షము ఫలించుచున్నది. అది పూర్ణఫలంబునకు వచ్చిన వెంటనే కదళీతరువువోలె మూలచ్ఛేదమై పోవుట నిక్కము. నా

మాట వినుము. శశిరేఖను గౌరవుల కీయకుము. పరిస్థితైశ్వ ర్యమును గాంచి మతిభ్రమణమందకుము.

బల—కృష్ణా! నీవు పాండవపక్షపాతివని లోకము లింకను బాగుగా నెఱుంగుటకుఁ దగినట్లు నాకుపదేశించితివి. నీ పక్షపాతము నీవు బోనిచ్చుకొంటివిగావు. ఆ పక్షపాతముతోడనే సుభద్ర నర్జునునకంటగట్టితివి. అప్పుడు నా కండ్లలో గారముగొట్టి యీ కార్యము గావించుకొనిపోయితివి గాని లేకున్న నీ తరమగు నా? సుభద్ర కీదుర్గతి పట్టునా? ఇప్పుడుగూడ నా మెడలు విఱిచి శశిరేఖ నభిమన్యున కిప్పింపఁదలఁచితివా? అందుల కై కౌరవు లల్పాయుష్కులని జెప్పుచుంటివా? కానిమ్ము. కాకియై కలకాలము బ్రదికియుండుటకంటె హంసయై యర ఘడియయుండు టుత్తమోత్తమముగాదా? కానిమ్ము. ప్రపం చమే మునిగిపోయినప్పు డాలోచనతో నిమిత్తమేమియున్నది. నీ వింక నన్ను తేపకుము. శశి నభిమన్యునకిమ్మని బలవంత పెట్టకుము.

కృష్ణు—అగ్రజా! సమయము వచ్చినది గావున నీ కొకవిషయము ను జ్ఞప్తికిదెచ్చుచున్నాను. నేను పాండవపక్షపాతి మాత్రమె న్నఁటికినిగాను గాని న్యాయపక్షపాతిని. సత్యమెక్కడుండు నో నే నక్కడుందును. నేనెక్కడుందునో జయలక్ష్మి య క్కడనే యుండును. ఆ విషయమటుంచుము. వెనుక నీవొక మారు నన్నుఁగాంచి—

మ. "మన మేనల్లుఁడటంచు నెంచక నిజం । బాలోచనల్ జేయ నీ
తని కడైనటువంటి బాలు నొక నెం । దైనన్ గినన్ బాలగా
వున నాపుత్రిని వీనికిత్తు"ననుచున్ । మోదంబుతో నాఁడు నీ
వని నేఁ డిట్లన లోకులేమనెదరో । స్వాతంబునం దెంచితే?

నాఁడు నీ వామాటయే యనకున్నచో నేఁడు నేను నిన్నిట్లడుగుట కవకాశమే లేక యుండెడిది. మనమనినమాటను మనమే నిలువం బెట్టుకొనకున్న నిం కేమున్నది?

బల—నాఁ డాతని గుణరూపాదుల కచ్చెరువడి బిడ్డనిచ్చిన మంచిదే మో యని యూహించి యట్లంటిని. అంతకంటె మంచిసంబంధమున్నప్పు డాసంబంధ మెట్లు జేసికొందును? ఆఁడుబిడ్డగలవార నేకసంబంధములు జూచుకొనుటయు గ్రియ కేదో యొకటి నిశ్చయించుకొనుటయు బ్రపంచధర్మమై యున్నది గాని లేనిపోని యడియాసలఁ బెట్టుకొని తమ యిష్టానుసారముగా లోకము నడుచుకొనలేదని ప్రతివారిని నిందింపఁదగునా? అదియే నా సత్యవ్రతాచారపరాయణులకు ధర్మము. లోకులెట్లనుకొనిన నాకేమిలోపము. వారినాల్క లెట్లాడిన నట్లాడెదరు. పరుల మంచిచెడ్డలతో వారికి నిమిత్తములేదు. పరుల బాగోగులతో వారి కగత్యములేదు. నా కుమార్తె చేపుకష్టముల బాల్పడినవయుచుండ లోకులేమైన నామె బాధలు తొలంగింతురా? తొలగింపఁగలరా? అప్పుడు కర్మసూత్రమందురా? ఇట్టి పాపిష్ఠిలోకము నాధారము జేసికొమ్మందువా? నాకిట్టిలోకులతో నిమిత్తములేదు. నా బిడ్డక్షేమము నేను జూచుకొనకతప్పదు. కావున చూచితిని. నాకు నచ్చినసంబంధము నిశ్చయించితిని.

కృష్ణు—అట్లయిన నీవిప్పుడేమందువు?

బల – శశిరేఖమాట నీ కిఁక తలపెట్టవలద నెదను.

కృష్ణు—నా మాట మన్నింపవా?

బల—ఈ విషయమున నన్ను బలవంత పెట్టకుము. ఒకానొకవేళ బలవంత బెట్టినను లాభ మెంతమాత్రమును లేదు.

కృష్ణు—సరే. (అని సుభద్రతో) సోదరీ! ఇంక మీరును మీరును జూచుకొనుఁడు. ప్రియసోదరుండ నగు నా కాతఁడు చెప్పిన సమాధానమును వింటివిగదా? న న్నింకేమి చేయమందువు?

సుభ—అన్నా! నిన్ను నేనేమిచేయమనఁగలను? నీ పుత్రిక గనుక నా నిన్నుబలవంతపెట్టనా? కానిమ్ము నాబిడ్డకు వివాహము గానప్పుడే నాలోచించుకొందును.

తే. గీ. మేనఱిక మన్న ముచ్చట । మానెగాని
సుతున కెట్లు బెండ్లిగాదో । చూచుకొందు
నంతకుం దగి నట్లుగా । బొంతయొకటి
దొరుకకుండునె? పెండ్లికూ । తుండ్రి కరవె?

అన్నయ్యా! నాదొక్కమనవి యున్న దాలింపుము. అన్నగారు నన్నునిన నిందావాక్యములు నీవుగూడ నీచెవులార వింటివిగదా? ఆయన కంత యాగ్రహము వచ్చినపిమ్మ టింక నే నిందునిల్చుట తగదు. నా సుతునితో నా పతిచెంతకుఁ బోవదలచితిని. మాపోకడ కనుమతింపుము.

బల—మా యిల్లు విడచిపోయినచో మీకు గతిలేదని యంటిని గాని నిన్నిటనుండి పొమ్మనియంటినా?

సుభ—(కోపముతో) ఆదుడుకువాక్య మనవలదనియే నిన్ను మఱల హెచ్చరించు చున్నాను. నావిషయమై నీవేమియు నోరె త్తవలదు.

కృష్ణు—సోదరీ! నీ చిత్తమువచ్చినట్లు నీ వొనర్పుము. దాని కొకరి యనుమతి యెందులకు? (అని నిష్క్రమించును.)

సుభ—(నిష్క్రమించును.)

బల—రేవతీ! చూచితివా? ఎంతరాద్ధాంత సిద్ధాంతమైనదో!

రేవ—ప్రాణేశ్వరా! అడుగుటలో మా వదినగారి తప్పులేదు. ఇమ్మ

విచెప్పుటలో మఱిదిగారిదోష మంతకంటె లేదు. మీ కిష్టమైన నీయవచ్చును. లేకున్న మానవచ్చును. కాని- ఆఁడుపడుచు ననరాని మాటలని—అర్ధోక్తిలో

బల అది నీ కనవసరప్రశంస. అంత నిష్ఠురముగా మాట్లాడితిని గావుననే నింతలో మనము బైటబడగలిగితిమి గాని లేకున్నచో వారెంతగడబిడయైనను జేసియుందురు. వివాహమహోత్సవకాలమున సుభద్ర లేకుండుటయే మంచిది.

[అప్పుడు దేవకీదేవి ప్రవేశించుచున్నది.]

దేవ — కుమారా! ఇదేమిదురన్యాయమురా?

బల — దురన్యాయమున కేమున్నదమ్మా!

దేవ — ఏమున్నదా? ఆఁడుపడుచు నట్లేడ్పింపవచ్చునా?

బల — నేను దాని నేడువ్రమంటినా?

దేవ — నీబిడ్డ నామెసుతున కీయకున్న నేడువదా? నీ వేడువ్రమని వే ఱే చెప్పవలయునా? నీకిది ధర్మమా? దుర్గుణభూయిష్ఠుండగు దుర్యోధనుఁడు నీ కెక్కడ దాపురించెనురా తండ్రీ! అది మనకుఁ గలసినసంబంధము గాదురా?

బల — అమ్మా! పరుల నూరక దూషింపక నీ యభిప్రాయమేమియో చెప్పుము.

దేవ - నాయనా! అభిప్రాయమున కేమున్నది.

చ. మనశశిరేఖ చిత్తమభి । మన్యునిపైఁబడి యుండె, వారి ప్రే
మనుఁగని యట్లుజేయుటకు । మాకును నిచ్చ జనించె, రేవతీ
మణికిని నిష్టమయ్యె, యను । మానమి కేల? వరించుకొన్న వా
రిని విడదీయఁజూచుట త । రింపఁగ రానటువంటి పాపమూ.

ఉ. పాపముమాట కేమి? కడు । పారఁగఁ గన్నటువంటి పుత్రి యొం
త్రో పరితాపమందు సుత । దుఃఖపడఁగఁ గనజాలు దొక్కొ- బల్

పాపులు కౌరవాధములు । వారలతో నెటు వియ్యమందఁగా
నోపుదు నాను మయ్యసుగు! పోజ్యాలు డర్జును వియ్యమందుమా॥

బల —అమ్మా! అభిమన్యుని సుగుణపుంజంబులమాట యటుంచుము.
కౌరవులు పాపులని నీ కెవ్వరు చెప్పిరి?

దేవ—నాయనా! ముంజేతికంకణమున కద్దమొకటి కావలయునా?
కౌరవులు పాపాత్ములనుటకు లెక్కలేనన్ని నిదర్శనములు
జూపింపవచ్చును. నేను చూపించు టెందులకు? నీవెరుంగవు
గనుకనా? ఆపాండవులు: —

చ. తనపినతండ్రి పుత్రులుగ । దా? తన సోదరులేగదా? జగం
బునను మహాత్ములన్న నుతి । బొందినవారుగదా? తలంప వా
రిని గడుద్వేషభావమున । లెక్కకు మిక్కుటమైన కష్టముల్
క్షణక్షణ మట్లుబెట్టు టది । చాలదె? పాపులటంచుఁ జెప్పఁగన్.

తనపినతండ్రిపుత్రులకంటె తనకు గర్ణుఁడెక్కువవాఁడా? ఆదుష్టాత్ము
ని దురాలోచనములకుఁ జెవియొగ్గి పాండవుల నెనలేని కష్ట
ములపాలుసేయునా? భగవంతునికృపవలన ధర్మనందనుడజా
తశాత్రవుఁడై యుంటచే సరిపోయినదిగాని — అతఁ డనుమతి
యే యొసంగినచో- భీమార్జును లాదుర్యోధను నింతకాలము
బ్రతుకనిచ్చియుందురా? అజ్ఞాతవాసానంతరమున వారిపాట్లు
నీవే జూడఁగలవు. వారి శాంతతయే ప్రస్తుతము వారికిట్టి దు
స్థితి దెచ్చినది.

బల— అది శాంతముగాదమ్మా వెఱ్ఱితల్లీ! దానిపే రసమర్థత.

దేవ— నాయనా! అది యసమర్థతయా? ఎంతమాటంటివి? భీమా
ర్జునులను సోదరులుగాఁ బడసిన ధర్మజున కసమర్థత్వమేమి
తండ్రి!

అమ్మా! ఒక రౌనన్న దింకొకరు కాదనుట ప్రపంచ స్వభావము. మాటకు మాట తెగులును నీటికి నాచు తెగులును గలదు. నీయభిప్రాయము నాకు బోధపడినది. కాని నే నీ విషయంబున నెవ్వరిమాటయు వినదలంచుకొనలేదు. ఏది యెట్లయినను సరే. కానున్న దెట్లును గాకమానదు. నాపుత్రిక నా దుర్యోధనపట్టి కొసంగితీరెదను. అమ్మా! శ్రీమద్దులకృష్ణుడు పాండవపక్షమూనినచోఁ గౌరవులు గతింతురా యెన్నఁడనుకొనకుము.

ఉ. పాండవపక్షమూని యల ఫల్గుని తోడ ముకుందుఁడుండి యా
 భండనభూమి జొచ్చునెడ ప్రాణభయంబది యేరికమ్మ! నే
 నుండెద కౌరవేంద్రుదెస నూఱక యుందునె బిడ్డనిచ్చి దే
 వుం డెటుచేసినన్ సరియె పొమ్మిఁక నన్ బలవంతపెట్టకన్.

నా నిశ్చితాభిప్రాయ మిప్పటి కేని తెలిసినదిగదా? ఇంకఁ బొమ్ము.

దేవ—నాయనా! నీవంత నిష్కర్షగాఁ జెప్పిన నే నేమనంగలదానను. సుభద్ర మోహమైనను జూచుమని మఱల మఱల గోరుచుంటిని.

బల—సుభద్ర మో మొక్కమారుగాను వేయిమారులు జూచితిని. ఆమె మోమునం దేమియున్నది? పాండవపరాధీనత మున్నది. అభిమన్యుని సురవస్థ యున్నది. ఆజన్మకాలమును బుట్టినింటఁ బడియుండవలసిన దుర్యోగమున్నది. మొగుఁడుండియు లేనట్లుండవలసిన యవయోగమున్నది. పనికిమాలిన దురభిమానమున్నది. సంపూర్ణమగు దుఃఖమున్నది. ఆత్మస్తుతి పరనిందాపరాయణత్వ మున్నది. సహోదరనింద యున్నది. ఊర కేడ్చుటయున్నది. తనకోర్కె చెల్లింపనివారిని శాపనార్థములు బెట్టుటున్నది. ఇవియన్నియు స్వయముగా జూచియే యామె సుతునిచెంత నాబిడ్డకు సుఖములేదని గ్రహించితిని.

అట్లు గ్రహింపఁగల్గుటచేతనే మాకీని పద్దుల [illegible]
నిశ్చయించితిని. అట్లు నిశ్చయించుటచేతనే యిని- [illegible]
ఇన్నికాదులు- ఇన్నినిందలు- ఇన్నిబోధలు- ఇన్ని [illegible]
ములు- ఇన్ని యవకతవకలు బయలుదేఱినవి. ఇట్టి [illegible]
యిన్ని బయలుదేఱినను నేను బెదురను. [illegible] నా
[illegible] ప్రియ మింకెన్నఁటికిని దిప్పుకొనను. తిప్పుకొను
[illegible] ములేదు. నీవు నాకింక చెప్పవలదు. (అని లేచి)
రేవ[illegible] పోదము. (అని రేవతితో నిష్క్రమించును.)

దేవ— ([illegible] చరించుచు) ఎంద తెన్నివిధముల బోధించి
[illegible] బలరాముని మన స్సింక దిరుగదు. ఎంతచిత్రము.
[illegible] దత్యధికానురాగముగల మావాఁడుగూడ చిటి
[illegible] లోభమున నెరవాని కాసించి లోల్లింటి మోహ
[illegible] దిగమ్రింగినైచెనే. వెనుక మాసుభద్రావివాహ
[illegible] తకంటె మొక్కువ యల్లరిజరిగినది. క్రియకు మాబల
[illegible] కే బరాభవమువచ్చినది. ఇప్పు డీశశిరేఖకుఁ గూడ
మేనయత్తపోలికయే వచ్చినది. కట్టకడపటకు మేనత్తవోలె
దానికి [illegible] దానికి దీరునో? తీరదో? తెలియదయ్యెను. శశి
రేఖ దుర్యోధనుని కోడలైనచో దుర్భరకష్టంబు లెన్నని దాపు
రించును. అట్లు జరుగకుండుట కేమిని మార్గమున్నదేమో మా
కృష్ణునిచే నాలోచించెదఁగాక.

(అని నిష్క్రమించుచున్నది.)

ఇది ప్రథమాంకము.





శ్రీ

# సంగీత శశిరేఖ.

## ద్వితీయాంకము.

### ప్రథమ రంగము.

—( స్థలము:—శశిరేఖ పుష్పవనము )—.

[శశిరేఖ విచారముతోఁ గూర్చుండియుండఁగాఁ దెరలేచును.]

3. వ. అనుబంధము.

శశి—(నిట్టూర్పువిడచి) తండ్రీ! నాయెడల నీకీకఠినత్వ మెట్లువచ్చినది?

సీ. 'నాకులదీపమా, నాతల్లిరో!!' యని
లాలించు ప్రేమమే । మూలబడియె
'కన్నబొజ్జా! యేమి । కావలె నీ'కను
మురిపెంపు ప్రేమమే । మూలఁబడియె
బలితంపు ప్రేమతో । బిలిచి నాశీర్షంబు
ముద్దాడు ముద్దులే । మూలబడియె
నంత కంతకుఁ బ్రేమ । మెంతయో జూపించు
పుత్రికా మోహమే । మూలఁబడియె
తల్లికంటెను మిక్కిలి । దయను నన్నుఁ
బెంచి రక్షించు ప్రేమమే । మూలబడియె

కన్నపుత్రికపై నింతి । కఠినమూన
నేను చేసిన తప్పేమి । నేడు జనక!

తండ్రి ! నీవే నాయెడల నిర్దయవహించిన నాకింకేదిదిక్కు. నాజనని నీమాటకెదురాడదు గదా ! నన్నింకెవ్వరు రక్షింప సమర్థులగుదురు ? ఆహా !

తే. గీ. తల్లిదండ్రులు మిగుల ని । ర్దయను తమకు
సంతతిని బోవసమకట్ట । జాలనపుడు
కరుణ బెరవారు రక్షింపఁ । గలరె ? యకట !
వెలుఁగ జేను మేయఁగఁ గాచు । బలుఁ డెవండు ?

కట్టా! నాజనకున కీ కఠినత్వమెట్లుత్పన్నంబగును?

ఉ. పుట్టిననాఁటినుండియును । బుత్రికపైనసె నీదుప్రాణముల్
బెట్టి యనేక భంగులను । బ్రేముడితో ననుఁ బెంచి, నేఁడు న
న్నట్టి క్షణంబులోన బల । వంతముగా నిటు దుఃఖవార్ధిలో
నెట్టనద్రోయ న్యాయమగు । నే జనకా! కడునిర్దయుండ వై.

తండ్రి! నీ కిట్టి నిర్దాక్షిణ్య మెట్లువచ్చినది! తొలుతనుండియు నన్నుఁ జూచిన ట్లాయర్జునకుమారునిఁ గూడ జూచితివిగదా? ఆతనిపై నీ కేల నీనిర్నిమిత్తాగ్రహము వచ్చినది. ధనము శాశ్వతమనియే తలపోసితివా? చంచలంబగు లక్ష్మిని నమ్మికొనిన దౌర్భాగ్యుం డెవ్వఁడు సుఖోపజీవనము జేయఁగలిగెను. క్షణభంగురంబగు ద్రవ్యమున కాసించి చిరస్థాయి యగు సంబంధమును జెడ గొట్టితివా ?............ జనకా ! ఆ యభిమన్యుని మఱచి పొమ్మని నీవు చుల్కనగాఁ జెప్పఁగలిగితివి గాని నే నానవమన్మథాకారుని – నాచిత్తచోరుని – నాప్రాణసమానుని – నా జీవధనంబును నేను మఱవగలననియే దలంచితివా ?

సీ. శశి, శశి, రోయని । సగము పేరున బిల్చు
ముఱిపెంపు పిలుపు నే । మఱచు టెట్లు ?
ఆటలలో సైత । మధికాను రాగంబు
మఱి మఱి చూపుట । మఱచు టెట్లు ?
ననుఁజూచు నెపమునఁ । బనియేదో బెట్టక
బరతెంచు పేర్చు నే । మఱచు టెట్లు ?
యేదిగోరిన నదే । యిట్టె తెచ్చి యొసంగు
మహనీయు ప్రేమ నే । మఱచు టెట్లు ?
మమత నించెడి రూపంబు । మఱచు టెట్లు?
మధుర మైనట్టి పల్కులు । మఱచు టెట్లు?
మంజులాకారమును మది । మఱచు టెట్లు?
మహిత గుణధన్యు నభిమన్యు । మఱచు టెట్లు?

(ఒక్క నిముష మూరకొని) అయ్యయ్యో! నాదురదృష్ట మెంతవఱకు వచ్చినది. నాకుఁ గావలసిన వారెల్ల— నాసుఖమునకై — నా యానందమునకై — నామేలునకై నాజనకునితోఁ జాలవరకు వాదించిరి గాని యావంతయు లాభకారి కాలేదు. నన్నీయా పదనుండి సముద్ధరించు వారింకెవ్వరున్నారు ?

సీ. కాళ్ల వేళ్లనుఁబడి । కరుణింపు మనివేడు
చెల్లిప్రార్థనఁ బెడ । చెవిని బెట్టె
అన్నయూ! నామాట । లాలింపు మని గోరు
శ్రీకృష్ణు మాట ని । రాకరించె
కురునాథు దుర్గుణ । మెఱుగవే వలదని
తల్లి బోధింప సు । తయును వినఁడె
మనశశి కోర్కెను । మన్నింపు డని వేడు
నిజభార్య ప్రీతిమాల । నెట్టివైచె

నంజలి యొనర్చి నీపుత్రి నాదరింపు
మనుచుఁ గాళ్లంటి వేడు నన్నవల ద్రోచె
నేము సేయుదు? యెవ్వరింకేమి చెప్పఁ
గలరు? చెప్పినన్ లాభంబు గలదె యింక ?

సర్వవిధముల నా యాసలన్నియు నిరాసలయ్యెను. నాకోర్కెలన్నియు వమ్మయ్యెను. నాజనకుఁడు చూపిన యీతిరస్కారంబు వలన నారాజన్యచూడామణి నాకు దూరమైపోవును గాఁబోలు. ఇంకేమిదారి? ఎవ్వరిని జేరుదు? నా యీయాపద కడ్డుబడువారెవ్వరు? అయ్యో! తండ్రీ! నీకు నాపై నింతటి క్రోధమున్న నీముసలాయుధముతో నాతల బ్రెల్లనేయరాదా? అదియైన సంతోషముతో భరియింపగలుగుదునే. నీ వెంతటి కఠినహృదయము. నా కెట్టి కఠినతమమైన యాజ్ఞనిచ్చితివి...... ఓతండ్రీ!

మోహావళీవృత్తము.

మారసమానుని, మంజులరూపుని,
మానితధీరుని, మాన్యుని, కీర్తివి
స్తారుని, ధర్మపథైకవిహారుని
సంస్తుతు డాయభిమన్యుని, చిత్తజా
కారుని, శూరుని గోరి వరించితి
గావున సద్దయగూర్పుము లేనిచో
ధారుణియందున జీవము దాలిచి
దాల్మిసుఖించుట కష్టతమంబగున్

(అని విచారముతోఁ దల వాల్చుకొని యుండును.)

[అప్పుడు కనకలత, రూపలతయును చెలులిరువురు ప్రవేశించుచున్నారు.]

కన — రూపలతా! శశిరేఖ తన విద్యాగారమున లేదేమే ?

రూప — శశిరేఖ విద్యాగారములో లేకుండుటకు హేతువు నేను జెప్పవలయునా ? పోయి యామెనే యడుగరాదా?

కన — పోని మ్మామె యెచ్చటనున్నదో చెప్పుము. పోయి యట్లే ప్రశ్నింతును.

రూప — ఇది బాగున్నదే. ఆమెయునికి నాకు దెలిసియున్న నేనింతకు ముందే జెప్పియుందును. ఆమె నాకెక్కడను గాన్పింపకుండుట చేతనే యుద్యానవనములో నున్నదేమో యని జూచుటకై వచ్చుచుంటిని. ఇంతలో నీవువచ్చితివి.

కన — ఆమెతో నీకిప్పు డేమిపనియున్నదే ?

రూప — పనియేమున్నది కాని రేవతీదేవిగా రూరక విచారాక్రాంత మనస్కులై యున్నారు. శశిరేఖను దోడ్కొని రమ్మని నన్నుం బంపినారు.

కన — ఆం. అమ్మగారు విచారించుచున్నారా ? నెచ్చెలీ ! ఎందుకే విచారించుట.

రూప — ఏమున్నదమ్మా! ప్రపంచమంతయు ధనముతోనే నిండియున్నది. "రూక లేనివాడు పోకచేయడు" అని పుస్తకములలో ననే చూచితిమిగాని స్వానుభవమునకు రాలేదు. ఇప్పుడు వచ్చినది. అభిమన్యునకేమో ధనము లేదట. అందుచే శశిరేఖ నాతనికీయక దుర్యోధన సుతుండగు లక్ష్మణునకిచ్చెదనని బలరాముడు భీష్మించుకొని యున్నాడట. ఎవ్వరెన్ని విధముల బోధించినను వినక ముహూర్తమును నిశ్చయపఱచి లగ్నపత్రికను గౌరవ రాజేంద్రునకు బంపించెనట. వింటివా యీ దురన్యాయము

కన—ఏమేమీ? నిరంతర కరుణామయుండును, సదసద్వివేకశాలియు
ను, ధర్మపవిత్రాచారపారీణుండును నగు బలరాముండే యిట్టి
కాసిపని కనుమతించెనా? అయ్యయ్యో! పాప మాశశిరేఖ
గతియేమని కానలసి యున్నదో గదా?

రూప—పాప మందులకే దేవి ఖిన్నురాలయి యున్నది.

కన—అట్లయిన శశిరేఖ యీయుద్యానవనములో నుండును. చూచి తీసికొని పోదము రమ్ము. (ఇరుపురును గొంతదూరమునడతురుఆ

రూప—(ముందునకు జూచి) కనకలతా! అదిగో! మనశశిరేఖ. ) మాలతీనికుంజంబుమాటునం గూర్చుండి విచారించుచున్నట్లున్నది. పోదము రమ్ము. (అని నడచుచున్నారు)

శశి - (తనలో) ఆహా! ఎన్నివిధముల నాలోచించినను నాయాపద గడువంబెట్టువారెవ్వరును గానరారు. ఎవ్వరెన్నివిధముల బోధించినను నాతండ్రి తనపంతము నెగ్గించుకొనక మానడు. అయ్యో! మాపరస్పర మోహానురాగంబైనను వీక్షింపక నాతండ్రి నన్నింత జేసెను. అనుపమానతేజుండగు నాయభిమన్యునివిడచి జీవింపంజాలను. దురితాత్ముండగు లక్ష్మణుని పేరైనను వినజాలను. నాజనకుని మాహాత్మ్యమువలన నాయాశాలత చచ్చిపోయినది. ఇట్టియెడ నేనేల చానరాదు. బ్రతికియుండి యింకేమిసుఖము బడయుదును. నాస్థితిగతులింతవఱకు వచ్చిన పిమ్మట నాకుకష్టమేగాని సుఖములేదు. ఎట్టియాశయునులేని నాకింక నీజీవములతో నేమిపని. (అని చేతులుజోడించి)

కవిరాజరంజని.

మనోహరా! మనోహరా!! మనోహరా!!! యిదే
మనోహరంపు నీదునా మమే భజింపుచున్

జనంగనుంటి నాతిప్రి । ష్టపంబు జూడఁగా
ననున్ స్మరింప కింకపై । న నామనోహరా!

బావా! నీవెఱుఁగని దేమి యున్నది.

ఉ. చేయునదేమిలేక, యెది । చేసిననైనను గాంచు కేనియున్
శ్రేయము లేదటంచు మన । చెల్మి దలంచుక నింత సేపుయూ
హ్యాయముదీర నేడ్చి బల । వంతముగా ననుప్రల్ దొలంగు టే
శ్రేయమటంచు నెంచితి క్ష । మింపకుమీ ననుఁగూర్చి బెంగలో.

బావా! శీఘ్రముగా నాకు సెలవొసంగుము. తెలతెలలై—తరంగోప మానములై—తలకున్కలై—జనుదెంచుచున్న నాయీ విచారసాగరమునుండి తరించుటకు సెలవొసంగుము. ఈనిర్భాగ్యురాలి కీజన్మమున నిను గూడఁ బ్రాప్తిలేదు. ఉత్తరజన్మమందైన నీయూరుభాగముపైఁ గూర్చుండి సుఖించుభాగ్య మా విధాత నానుదుట లిఖించుగాకయని మిగుల బ్రార్థించుచు జీవముల విడుచుచున్నాను. ... ... ...

4. వ. అనుబాధము.

ఓ పరమేశ్వరా! నన్ను నీలో జేర్చుకొమ్ము. నా యాత్మకు శాంతినిమ్ము. నాప్రాణేశ్వరునకు ధైర్యమిమ్ము. (అని లేచి) ఆఁ. ఎవరు? అమ్మా! నీవా? నీకు గర్భశోకముగలిగించి పోవుచుంటినని విచారించుచుంటివా? జననీ చింతింపకుము. నీకొక్కదిర్ప లేదని నీపతిని నీవు నిందింపకుము. పుత్రికావ్యామోహము విడచిపెట్టుము. (ఆగి) ఆఁ. ఏమనుచుంటివి? "నన్ను మఱచుటెట్లే తల్లీ" అనియా? జననీ! గుండె ఱాయిచేసుకొమ్ము. ఏమంటివి? "నవనీతమువంటిహృదయము ఱాయి యెట్లగు" ననియా? అయ్యో వెఱ్ఱితల్లీ! ఆవిషయము నాతండ్రిగారి నడుగుము. ఆ యనయే నీకు చక్కనిమార్గముపదేశించి నీహృదయము వజ్ర

హృదయముగా మార్చఁగలఁడు............ఓ మాఁడుబిడ్డలం గన్న తలిదండ్రులారా !

చం. ధనము ప్రధానసాధనము । ధారుణి నెల్లను నిగ్రహింపఁగా

ననుచుఁదలంచి, పాపునకు । నజ్ఞునకున్ గొఱమాలువానికిన్

దనయల నంటఁగట్టక య । థార్థముగా ధనతృష్ణ వీడి ప్రా

జ్ఞుని, గుణవంతునిన్ విమలు । నొక్కనియల్లుని గా గ్రహింపుఁడీ.

అందువలన మీతనయులు సుఖింతురు. మీయాత్మలకు శాంతిఁగూర్తురు. మీ కెనలేని మోదమిచ్చెదరు. ఇందులకు వ్యతిరిక్తముగా ధనపిశాచమునకు దాసులై మీకుమార్తెలకోర్కె నిరాకరించితిరేని మీతనయలు దుఃఖాంభోధినిమునింగి చింతాభరంబున నన్ననుసరింపఁజూతురు. మీయాత్మలకశాంతిఁగూర్తురు. మీ కెనలేని దుఃఖమిచ్చెదరు. నిజమాలోచింపుఁడు. ఈప్రపంచంబున ధనముకన్న నీచమగువస్తువు లేదని గ్రహింపుఁడు.... (రెండడుగులువైచి) దేవా ! రాధామాధవా! నీయగ్రజునిపట్టి యయ్యు భగ్నమనోరథయై చచ్చుచున్న నీమె నాశీర్వదింపుము. నీమేనల్లుని గరుణింపుము..................ఉద్యానవనమా ! నాకు సెలవొసంగుము. ఓతటాకమా ! నన్ను నీలోఁ గలుపుకొనుము. (అని నడువఁబోవ, చెలికత్తియ లిద్దరును జెతిమొక్కపక్కనుఁ బట్టుకొని యాపుదురు.)

రూప — చెలీ ! ఇంతదారుణమున కొడిగట్టితివేమమ్మా !

కనక — అమ్మా ! నీకురవస్థయంతయు రూపలత నాకెఱింగించినది. తల్లీ ! చచ్చి యెవ్వరిని సాధింపఁగలవు ?

రూప — కనకలతా ! నీవు వెంటనే వ్యాయామమందిరమున కరిగి గుణధన్యుం డగు నభిమన్యుని రెండవకంటివా రెఱుంగకుండ నిక్కడకు దోడ్కొనిరమ్ము.

కనక — మంచిది. (అని నిష్క్రమించును.)

రూప—(శశిరేఖను గూర్చుండఁబెట్టి తాను ప్రక్కను గూర్చుండి శశిరేఖముంగురులు సవరించుచు) అమ్మా! ఇట్లు చేయ గడంగుట నీకు ధర్మమా?

శశి (దుఃఖ మడంచుకొనుచు) నెచ్చెలీ! నన్నేమిచేయమందువు?

ఉ. తెల్లముగా మనోవ్యధను । దెల్పితి తండ్రికి, వేడుకొంటి, నా
తెల్లగరంగునట్లు, కరు । ణింపుమటం చటనున్నవారికిన్
యుల్లము వ్రయ్యలౌనటుల । నూరక యేడ్చితి, మొత్తుకొంటి, నే
కాళ్లను బట్టుకొంటి, కని । కారముజూప డికేమిసేతునే?

శా. నాదుఃఖంబును గాంచి తల్లియును నా । నాబంధువుల్ గృష్ణుఁడు
న్నాదోద్రేకముతోడ నత్తకడకు । న్మాబామ్మయున్ దండ్రితో
వాదింపన్ వినఁబోక వారిని సహా । వాగ్జాలి తూల్నాడె నిం
కేదారిన్ సుఖమార్గమబ్బునని నా । యీజీవముల్ నిల్పనే?

రూప—అయ్యో నెచ్చెలీ! కష్టములు పాపికోటికి గాక నిర్జీవకోటికి వచ్చునా? దావాగ్నివోలె గష్టములెల్ల చుట్టుముట్టినప్పుడే నరుఁడు తన ప్రజ్ఞావిశేషంబును జూపింపవలయును. కోర్కె సాధించుకొనవలయును. సర్వజగంబులం దారాయను ఖ్యాతి నార్జింపవలయును.

శశి—చెలీ! నీవుపదేశించినది ధర్మమేగాని యట్టియవకాశ మేమియు లభింపకుండుటచేతనే యిందులకు సిద్ధపడితిని. ఏమాత్రమవకాశమున్నను నానిండుప్రాణములు గంగ కర్పింప సిద్ధపడుదునా?

[అప్పుడు కనకలతతో నభిమన్యుఁడు ప్రవేశించుచున్నాఁడు]

అభి—కనకలతా!

మ. బలరాముండల కౌరవాధముని సం । బంధంబు కాంక్షింపఁగాఁ
గలముఖ్యంబగు కారణంబు ధనమే । కాఁబోలు, మేల్మేలు పేరి

మలతాపాశము నొక్క వేత్రికునకు దెచ్చిం । పజ్జాలు దివ్యాస్త్రమై
వెలయున్ ద్రవ్యమె మూఢమానవులకో । బింబోష్ఠి! లోకంబునన్.

కన — సందియమేమి ? అవతారపురుషుండని మనమనుకొనుచున్న బలరాముఁడే నీచాతినీచమగు ద్రవ్యము కాశించి—యశాశ్వతమగు ద్రవ్యమున కాశించి — పాపిష్ఠి యగు ద్రవ్యమున కాశించి — జ్ఞాననేత్రమున కడ్డుపొరయగు ద్రవ్యమునకాశించి—తనప్రాణములకన్న మిన్నఁగాఁ జూచుకొనవలసినపుత్రిని—తన్నే భగవంతునిగా నమ్ముకొని యున్నపుత్రిని—రక్షించుమని కాళ్లవ్రేళ్లబడి బ్రతిమాలుకొనుపుత్రిని— కర్కశహృదయుఁడై—ధనాశాపిశాచ పీడితుఁడై— కురుకులపాంసనుఁడగు దుర్యోధనపట్టి కామె నొసంగఁజూచునా ?

అభి—ఆహా! బలరాముఁ డెంత యవివేకి యయ్యెను.

ఉ. కూతును భాగ్యవంతునకుఁ । గూర్చుట శ్రేయమటంచు నాత్మలో
మాత దలంచుచుండునని । మాన్యులటండ్రు, వివేకశాలి వి
ఖ్యాతియశస్కుఁడన్న నుతి । గాంచిన నాపెదమేనమామ కాం
తాతతియట్లు మూఢుఁడయి । ద్రవ్యముపైఁ దమినిల్ప న్యాయమే.

కన — న్యాయమని యెవ్వరుచెప్పఁగలరు? న్యాయముగాదు కనుకనే శ్రీకృష్ణాదులెల్ల రాతని కిది తగదని బోధించిరి. ఎంతబోధించినను వినక కట్టకడపట కాదుర్యోధనపట్టియైన లక్ష్మణున కొసంగుటకే తీర్మానించుకొని లగ్నపత్రికను గూడ పంపించివైచెనఁట.

అభి —(తనలో) ఆహా! బలరాముఁ డెంతటిమౌఢ్యవర్తనుఁ డయ్యెను. నాయం దత్యంతప్రేమానురాగంబును నిల్పియున్న శశి దుర్వార్త విని పాప మెట్లు సహించినదో గదా? అయ్యయ్యో! నేనిప్పు డామె సన్నిధికి వెడలిమాత్ర మేమిచెప్పఁగలను? ఏమి

చెప్పిన నేమితప్పో? ఏమిచెప్పకున్న నేమిముప్పో? ఏమిచెప్పి న నేమివచ్చునో తెలియుట కవకాశము లేదయ్యె. అయ్యో! మా యనురాగంబున కెంతలో నెంతవిఘాతము వచ్చినది.

మ. సరసాలోకనహాసభాసురవిలా । సస్ఫూర్తి దీపించు సుం
దరి బాల్యంబుననుండి నన్నె పతిఁగా । దైవంబుగా భ...
స్థిరభావంబునఁ గొల్చుచుండు మగువన్ । జిత్తంబులో నెట్లు నే
మఱవన్ జాలుదు, నాశశి న్మఱచియే । మాటన్కొన్సుఖింతున్ గటా!

(దుఃఖమడంచుకొని ప్రకాశముగా) కనకలతా! నీ వెఱింగియున్నచో నిజమెఱింగింపుము. నిజముగా మామామయ్య దుర్యోధను నకు లగ్నపత్రిక పంపించివైచెనా?

కన—దేవా! నేను తమతో నసత్యమాడుదునా? పంపించెను.

అభి—(నిట్టూర్పువిడచి) అట్లయిన నిప్పుడు శశిరేఖయభిప్రాయమేమి?

కన—ఆమె కాసంబంధ మిష్టములేదు. నీ సుగుణంబులకు మేల్వాడి యున్నది.

అభి—ఏమిలాభము? జనకాజ్ఞ నెట్లుమీరఁగలదు?

కన—దానికి నేనేమి సమాధానము చెప్పగలను. వెడలి మీరాశశినే ప్రశ్నింపుఁడు.

అభి—కనకలతా! హృదయవిదారకమగు నాశాభంగముతో—నవనవ లాడుచు బుష్పించుటకు సిద్ధముగా నున్నప్పుడు కోటమాలి బుద్ధిలేమి దానిద్రివ్వి యింకొకచో బాతినప్పుడు వాడి వత్తి యైన మాధవీలతవంటి తనూలతతో—మనోహరమగు పచ్చికబయళ్ల నరవిందములబోలు కన్నుఁగవతో నల్లడఁ గనుచు నుదమందుచున్న తరుణంబున నాకస్మికముగా మువ్వన్నె మెకముఁ గాంచిన హరిణాక్షులట్లు చుఱుకుదక్కి—యచంచలము లైన గన్నుఁగవతో—బరువెక్కినహృదయముతో—కలతబా

టినమనస్సుతో—తపించి—కృశించి—శుష్కించి — నవసి—వసివాళ్వారియున్న నాశశిని — నామనోహరాంగిని—ఆ.ఆ. కాదు. కాదు... నా-మ-నో-హ-రాం-గి-కాదు. కాదు. నాకట్టి ప్రాప్తిలేదు. జగన్మోహనాంగిని-మకరందవిహీనమైన పద్మము వలె శోభదక్కియున్న యావదనాంబుజమును...కట్టా! ...నిరాశాతప్త హృదయుండనై—ని-ర్దాక్షిణ్య హృదయుఁడనై —నిర్జీవప్రతిమనై —నిర్భాగ్యుఁడనై— కాంచఁగలనా? కాంచి యూరకుండఁగలనా? అయ్యో! జనకాజ్ఞ నెట్లు మీరఁగలవని ప్రశ్నింపఁగలనా?

కన—అయ్యో! మాశశిరేఖవలె మీహృదయమును మీరు బాధ చేసికొనుచున్నారు. అది ధీరోదాత్తలక్షణము కాదు. మీరు వచ్చి శశిరేఖ నోదార్పవలయును.

అభి—కనకలతా! నే నేమని యా శశిరేఖ నోదార్పఁగలను. ఆమెకేమని ధైర్యముపదేశింపముందువు? నావలన నేమగును.

చంపకమాలిక.

జనకునియాజ్ఞ లెక్కఁగొని । స్వాంతమునన్ బెగడొందకండునా?
వెనుకటియట్లు నాయెడల । ప్రేముడి నిల్పి సుఖింపుమందునా?
వనితరో! నీసుఖంబునకు । ప్రాణము లడ్డమువైతునందునా?
వినుమిఁక పుత్రిమొట్టు యని । వేడుదు నీపితనంచు నందునా?
నిను సుఖపెట్టఁగాదలఁచి । నిల్చితి నీదరిజూడు మందునా?
గుణవతి! నీదుతండ్రి విన । కున్ననుఁ బోరుతునటంచునందునా?
నిను పినతండ్రిబోరుచునటు । నిక్కము జేతునటంచు నందునా ?
కనకలతా! యిటేమనినఁ । గాని ప్రయోజన మేమియున్నదే?
శ్రీకృష్ణానులకంటు నే నెక్కువగా నాబలరామున కుపదేశింపఁగల

నాఁ? పెంఁ కూతురే నా కీ సంబంధమువలదని శతసహస్రవి

ధంబుల శతపోరినను వినని నా పెదమామ నామాట మన్నించునా? ఆతనిహృదయము ద్రిప్పుకొనునను నాశ యింకెవ్వరికిని లేదు. ఇంక నే నేమని యామె నూరడింపగలను? ఈదుఃఖ మామెకును నాకును నాజన్మకాల ముండవలసినదే. ఇట్టి సమయంబున నే నామెచెంత కేమనిరాఁగలను. వచ్చి యేమి ధైర్యముపదేశింపఁగలను? నన్ను బాధింపకుము. అభిమన్యుఁడు నీతండ్రిగారియాజ్ఞ విని యరణ్యంబుల వెంటఁ బోయెనని మీశశిరేఖ కెఱింగింపుము.

5. వ. అనుబంధము.

......కనకలతా! ఈ జన్మమున నామాట మరవమని నీచెలి కత్తెతో నీవు జెప్పుము. పొమ్ము. నీవు నీచెలిచెంతకుఁబొమ్ము.
(అని వెనుదిరుగును.)

శశి—(అభిమన్యు నుద్దేశించి)

శా. మావారల్ శతపోరినన్ వినకనా । మాటల్ జెవిన్ బెట్టకో
బావా ! నాజనకుండు నిర్దయ వహిం । పన్ జాలె నిప్పట్ల నిం
కీవే యూరకయున్న దిక్కొ-రులు లే । రీజేడులోకంబులన్
రావే నీకయి గుందుచున్న శశిపా । ణంబుల్ దయన్ నిల్పవే?

రూప—అమ్మా! విచారింపకుము. నీచిత్తచోరుం డగు నభిమన్యుం డరుదెంచి నీకు హృదయానంద మొసంగును. చింతింపకుము. కనకలత నీమనోనాధుని దోడితెచ్చుటకై వెడలినది గదా ?

అభి—(విని యూగిపోవును.)

కన—ఆర్యపుత్రా! మాశశి మనోవేదన మీచెవులార వింటిరిగదా? మాట్లాడ కామె సముఖమునకు వచ్చి యామె నోదార్పుఁడు.

అభి—తప్పదా ?

కన — ఆయ్యో నాయిలు బంగారముగాను. తల మునింగిపోవుచున్న ప్పుడుగూడ తారాడుటయే పనియా ? (అని బలవంతముగా నభిమన్యుని శశిరేఖచెంతకు దోడ్కొని పోవును.)

శశి — (అభిమన్యుని జూచి విచారముతో దటాలున లేచి)

శా. బావా ! వచ్చితివా ? క్షణక్షణ మయో ! వ్యావృత్తి నీదర్శనా
భావం బయ్యెనటంచుం బొక్కి మహాదా ! పాయస్థితిన్ జిక్కి నా
యీవాంఛల్ మదముట్టు బెట్టనుమం నెం ! తే చింతకున్దక్కి యీ
జీవంబుల్ విడనున్న నీచెలిని ర ! క్షింపంగ నూహించుచున్.

(అని మీఁదవ్రాలి నభిమన్యుఁడు పట్టుకొని యాపును.)

శశి — (వెక్కివెక్కి యేడ్చుచు) బావా ! నాదుస్థితినంతయు వింటివా ? మన కెంతలో నెంతవిఘాతము వచ్చినదో గంటివా? ఈయాంపదనుండి నన్ను రక్షింపవా ? నీపరిఫుల్లవదనమండల సందర్శనం బింక నాకు దూరము గావలసినదేనా ? నీమృదు మధురవాక్యజాలంబులు విని సంతసించుభాగ్య మీనిర్భాగ్యురాలి కినుల కింక దూరము గావలసినదేనా ?— శశీ! శశీ! యని ముద్దుముద్దుగాఁ బిలిపించుకొను భాగ్య మీదురదృష్ట వంతురాలికి దూరము గావలసినదేనా?— నీహృదయముతో నాహృదయము—నీనయనములతో నానయనములు— నీపలుకులతో నాపలుకులు—నీమూర్తితో నామూర్తి— సమ్మేళనము గాకుండ దూరమై పోవలసినదేనా? ఆబాల్యమునుండియు దినదినప్రవర్ధమానమగుచున్న మనమైత్రి— ఎన్నఁటికిని విచ్ఛేదమగుట కవకాశము లేదనుకొని విఱ్ఱవీఁగు చున్న మనమైత్రి—సర్వసౌఖ్యంబుల కాలవాలమగు మన మైత్రి—నేఁటితో—యీవొక్క క్షణముతో—మన కన్నీఁటి ప్రవాహములోఁ బడి దూరముగాఁ గొట్టుకొని పోవలసిన

దేనా ? దీని కింక దారిలేదా ? లేదా ? మనము దిరిగి సుఖిం చు మార్గములేదా ? యింకముందు మన మానందాబ్ధి నోలలాడ దగుకాలము. నాజనకునివోలె నీవును నిర్దయ వహించితివా ? బావా! మాటాడవా ? ఒక్కమాట మాటాడవా ? కడసారి యానంద మొసంగి నన్నాదరింపవా ? తొల్లింటిప్రేమ మొక్కమారు జూపింపవా ?..........

పోనిమ్ము. మాటాడకున్న బోనిమ్ము. నీకుగాని యీశరీరమును నిర్మాల్యోదకమున కర్పించుటకు నీశిరఃకంపముచే నైన ననుజ్ఞ నిమ్ము. నాముద్దు చెల్లింపుము. నన్నాదరింపుము. సర్వమును దెలిసికొంటిని. నీయనుజ్ఞకై నిరీక్షించుచుంటిని. నామనోవాక్కాయకర్మంబుల నిన్నే వరించితిని. నీయాజ్ఞ లేనిదే నే నేమియుఁ జేయఁదగదు.' ఆజ్ఞనిమ్ము. నాకష్టవిముక్తి కాజ్ఞ నిమ్ము.

మ. తనబంధుల్ తలిదండ్రులున్ జెలులు నిర్దాక్షిణ్యులై యుండినన్
ఘనకష్టంబుల జుట్టుముట్టినను లోకంబెల్ల ద్వేషించినన్
మనసారన్ వరి[illegible]పతి -సన్మానంబులన్ బొందు జ
వ్వనిసుశ్లాఘనియు[illegible]గదా? బావా! ప్రపంచంబునన్.

నీవల్లన సన్మానంబులఁగొని సుఖించుభాగ్య మీనిర్భాగ్యురాలి కింక లేదు. నాజలప్రవేశమున కనుమతియొసంగుటే నీవలన నాకగు కడసారి సన్మానము. బావా! నీ వుపేక్షించినచో మిగుల కష్టంబుల బాల్పడిపోదును. శీఘ్రమే నన్ననుగ్రహింపుము. సైరింబ రమ్ము. నా కనుజ్ఞ నిమ్ము.

అభి -(శశిలేఖ కన్నీరు దుడుచుచు) వెఱ్ఱిదానా ? ఇట్లేల శోకింతువు ? నీవుశోకించి నన్నేల శోకవార్ధి బడద్రోయఁజూతువు ? నీవే నాప్రాణాధిక్య వని . నీవే నాజీవరాశి వని—నీవే నా

యానందచంద్రికవని—నీవే నావామభాగభూషణమవని—నీ వే నాప్రియసఖీమణివని-యనుకొని-కలంచి-విల్లివీగి-నిన్నుఁ జూచి నాకష్టములెల్ల మఱచి-నాభావిసౌఖ్యరమ్యహర్మ్యము నకు వాయుసోపానములు నిర్మించుకొనుచుండ- నువ్వీళులూరుచుండ ముదమూనుచుండ- నిట్టివిపరీతపు మాట- వేయిశూలంబుల పోఁ బకన్నను వాడియైన మాట- నాప్రాణంబు లెగ్గ్యమ్మడి దీయంజాలు ఫిరంగిపోఁటువంటి మాట- కర్ణకఠోరమైనమాట- వినినప్పుడే నాప్రాణవాయువు లెగిరిపోకుండ నిల్చియున్నందులకే నే తపించుచుండ- నన్నింకను దపింపఁజేయుట నీకు భావ్యమా? నీమరణానంతరమున నేను జీవించియుండఁగలనా? నీవే దీని కేదారియైన నూహింపుము.

లలిత—( చేతులునఁ బట్టివేశించి శశి రేఖాభిముఖ్యులను జూచి ) జనకాజ్ఞను మీరి మీనబావయొడిం శశిరేఖ యున్నదని బలరాముని కెఱింగించెదగాక. (అని నిష్క్రమించును.)

కన—(వెడలుచున్న లలితనుచూచి శశిరేఖతో) నెచ్చెలీ! దుష్టమార్గానువర్తినియును, తంత్ర[illegible]నగు లలిత యేకారణమువనో నిటునచ్చి తీక్ష్ణముగా[illegible]పురివైపునకుఁ జూచి శిరఃకంపన మాచరించి శీఘ్రముగా వెడలిపోవునది. ఈనరుసగనగా నీదుర్మార్గురాలు బలరామున కీవృత్తాంత మెఱింగించునేమోయని భయంబగుచున్నది. ఇదివఱకే యాగ్రహోయత్తచిత్తుండైయున్న నాతఁడీ వాక్యములను విని [illegible] పోయి యెవ్వరి నేమనునోయని భయంబగుచున్నది. కావున వెంటనే మన మిట్టనుండి వెడలిపోవుట మంచిది.

శశి—ఉరిసినపుండుపై నిప్పుబడినదా? దీని కేమిసాధనము.

రూప—అమ్మా! దీని కాలోచింపవలసిన పనిలేదు. నీబావయొద్ద మా

ఖ్యంబువలన నీబ్రిదుకు వ్యర్థమైపోవుచున్నది. ఈసమయమును దాఁటినచో నీవు కష్టములు బాలుగాక తప్పదు. నీమేన బావ నీకు దూరముగాక తప్పదు. అప్పుడు నీవు నీనిండుప్రాణములు గంగ కల్పించుటో — ధర్మవిరుద్ధముగా లక్ష్మణునితో బడియుండుటో జరుగవలసియుండును. ధర్మవిరుద్ధమున కీవంగీకరింపవనుట నిర్వివాదాంశము. చూచి చూచి నీ నిండు ప్రాణములుమాత్రము గంగ కల్పించుట కష్టముగాదా? వెనుక నీ మేనత్త యర్జునునికొఱకు నీవలెనే బరితపించినది. అప్పుడుగూడ నీతండ్రి యిప్పటివలెనే నీమేనత్తను దుర్యోధనున కొసంగెదనని పట్టుబట్టియుండెను. అప్పుడందఱేకమై మాయజేసి నీజనకుఁడు లేకుండజేసి సుభద్ర నర్జునున కంటగట్టి నూమెమనోరథ మీడేర్చిరి. కార్యానంతరమున నీజనకుఁడుగూడ నోరుమూసికొని యూరకుండెను. ఈచరిత్రమంతయు నీవిదివఱకు వినియున్నదే. నీ పినతల్లియగు రుక్మిణీపరిణయముగూడ నీవెఱుఁగనిది కాదు. కావున దగినసన్నాహమంతయు మేము జేసెదము. నీవు నీకాంక్షించిన వరునితో - నీమేనత్తతో - నీ మేనమామలచెంతకు వెడలిపొమ్ము. నీకో ర్కె నెఱవేఱుట కింతకంటె సాధనము లేదు. ఇది ద్రోహము గాదు. దోషము గాదు. ఈవిషయంబున నీతండ్రితక్క — దక్కఁగలవారెల్ల నీకనుకూలవర్తులై యున్నారు. నీవు నీభర్తతో వెడలితివని విని - దుర్యోధనుఁడు తనంత దానీ సంబంధము విడుచుకొని నెత్తిని చెంగువైచుకొని - నోరుమూసికొని యూరకుండును. నీజనకుఁడు గూడ తత్తుల్యుఁడే యగును. అప్పుడు నీవారెల్ల గలిసి నీతండ్రికి మఱల బోధించి యాతని నంగీకరింపజేసి భీమవివాహము గావించెదరు. కావున సందే

హింపక నీ పీతనితో నరుగుము. మేము దానికిఁదగిన సహాయ్యం బొనరింతుము.

శశి — నెచ్చెలులారా ! మీకు నాయందుఁగల యభిమానంబున కే నెంతయుఁ గృతజ్ఞురాలను. మీ జెప్పిన కార్యమువలన నాయుత్తమామలకును, నాపతికిని నాకును కూడ నిందపచ్చును. నా మేనమామ లీయకార్యమున కామోదముఁ జూపుదురా ? వారామోదింపని కార్యము నామనోహరుం డొనర్చునా ? ఏటి కీయడియాస. అన్నింటికిని సర్వోత్తమమైనది నాయసువులఁ బాయుట. దానికి మీరు జతనము లొనర్పుఁడు.

అభి — జీవితేశ్వరీ ! రూపలత చెప్పిన............... అర్ధోక్తిలో

బల — (ప్రవేశించి) శశీ ! ఇటురమ్ము.

[ అందఱును నివ్వెఱపోయి నిలువంబడుదురు. శశిరేఖ బలరాముని చెంత కరుగును. ]

బల — (క్రోధముతో) నీకు నే నేమి చెప్పితిని. నీ వేమిచేయుచుంటివి ? అభిమన్యునితో మాట్లాడవలదని నీకు నే జెప్పలేదా ? ఆతనిని ముట్టవలదని నీకు నే నాజ్ఞాపింపలేదా ? నీ వింకొకనికి దత్తముకాఁబడితివని నీకు నే నెఱింగింపలేదా ? ఇంకొకని కౌఁగిలిలోఁ బడుట సతీత్వమునకు భంగమని తెలియదా ? కులపాంసురాలా ! నాయాజ్ఞ మీరిన నిన్నిప్పు డేమిచేసినను పాప మున్నదా ?

శశి — జనకా ! నిజమగు ప్రేమకు — మోహమునకు స్వాతంత్ర్యము లేదు. అట్లయినచో నీయాజ్ఞ కడుగుదాటుదునా ? తొలుత నుండియు నామనోవాక్కాయకర్మల నభిమన్యునే ప్రేమించితిని. ఆతనినే మోహించితిని. నే నావిషయ మిదివఱకే నీ కెఱింగించుకొంటిని. అయినను నన్ను నిరోధించితివి. సంద్రం

బున కానకట్ట కట్టగలవారున్న నుండవచ్చును గాని మోహా ర్ణవమున కానకట్టఁ గట్టఁగలవా రెవ్వరు ?

బల—సరే. నీకు సమాధానముఁ జెప్పెద నించుకసే పట్లు నిలువుము. (అని యభిమన్యునిదిక్కు తిరిగి) పార్థపుత్రా ! తిన్నయింటి వాసములు లెక్కించినరీతి దౌర్భాగ్యుండవై నాబిడ్డహృదయము బా డొనర్చితి వేమిరా పాపహృదయా ? నీతండ్రిగుణములు నీవు బోనిచ్చుకొంటివిగా వేమి ? కాని యింతవఱకు నిన్నుఁ బెంచినదోషంబున శిక్షింపక విడచితిని. మారుమాటాడక వెనుదిరిగిచూడక నాగృహమునుండి యావలకుఁబొమ్ము.

అభి—పెదమామా ! నాయెడ మిక్కిలిమక్కువగల నిక్కరంగలోచన నిందువిడచి నే నొక్కడ నెక్కడకుఁ బోఁగలను ? తన యందు మక్కువగొనియున్న కాంత నెన్నటికిని విడువరాదని యు— ఎవ్వ రెట్టియభ్యంతరము గల్గఁజేసినను నాసతీమణిని రక్షించితీరవలయు ననియు నీసహోదరుం డగు శ్రీకృష్ణుఁడే రుక్మిణీకల్యాణకాలంబున నొకగుణపాఠము లోకంబున కుప దేశించియుండెను. పరులే యాయుపదేశమును శిరసావహింపవలసియున్నప్పు డాతని మేనల్లుఁడనైయుండి నే నాయుపదేశ మాలింపకుండుట ద్రోహము గాదా ? పెద్ద లేర్పఱచిన సదాచారమును బిల్లలు దాటవచ్చునా ? నామేనమామపోలిక నాకువచ్చినది. శశిరేఖయందు నా కధికారము లేదా?

రూప—(తనలో) ఇంక పాకము ముదురుచున్నది. (అపవారించి కనకలతతో) నెచ్చెలీ ! నీ వతిరయంబున వెడలి సుభద్రను దోడ్కొనిరమ్ము.

కన—(శిరఃకంపన మాచరించి వెడలిపోవును).

బల—నీజనకుని తుచ్ఛపుంబుద్ధియే నీకును నలవడినది. నీజనకుఁడు

సుభద్రావివాహవిషయమున నిట్లే కుమార్గవర్తనుఁడై నేను లేనితరి నుద్వాహ మాడినాఁడు. నేఁడు నీవును నట్లే చేయఁగడంగితివి.

అభి—ఎవరితుచ్ఛపుబుద్ధి యెవరుబోనిచ్చుకొనఁగలరు ? నీపాడుబుద్ధి నీవు బోనిచ్చుకొంటివా ? నీ వేనాఁడు మాకుటుంబమందు గౌరవముంచితివి. నీ కొకమూల పరాభవము జరుగుచున్నను-(అర్ధోక్తిలో) —

బల—

మ. తులువా ! మాటకుమాట నాడెదవు యెం । తో ధైర్యమున్నట్లు నీ
బలరాముం డన నెవ్వఁడంచు మదిలోఁ । భావించుచున్నావు? మి
మ్ముల రక్షించినప్రేమచే విడచితిన్ । బొమ్మింక పోకున్న నిన్
బలవంతంబుగ గెంటివైచెదను నీ । బా బెవ్వఁ డడ్డం బగున్.

అభి — ఈమాత్రపు రాచకార్యమునకు నాబాబుకూడ రావలయునా?

చ. పురహరుఁగెల్చి పాశుపత । ముంగొని సర్వజగంబులందు సు
స్థిరమగుకీర్తి నిల్పునటు । జేసి మహేంద్రుని యర్ధపీఠమం
దురవడి గూరుచుండి విజ । యుం డనుచున్ బిరుదంబుగొన్న యా
నరునికు మారుఁ డొక్కఁడు ర । ణంబొనరింపఁగ నీకుఁజాలఁడే ?

బల — ఏ మావదరుఁబోతుతనము. నిన్నఁటివఱకుఁ దింకిడి గతిలేక మాయండకుఁ జేరినవాఁడ విప్పు డొకచిగురుఁబోడిక్తై యెంతవాఁడవైతివి ? మెడబట్టుకొని గెంటుచుండఁ జూఱుపట్టుకొని వ్రేలాడు మొండివాఁడ వైతివేమి ? ఇంతకాలము మాసముఖమున నున్నందులకు మాగుణంబులం దొకటియు నీ కలవడ లేదేమి? స్త్రీయగుట నీజననికభిమానములేకుండ నుండునేమో గాని యభిమానధనుండగు నర్జునుని కుమారుండగు నీకభిమానము లేదేమి ? శశిరేఖపై నభిమానము విడచి నాయింటినుండి

లేచిపోయెదవా ? చావఁగొట్టి వెడలనడపవలయునా ? పొమ్మనినను బోవని నీవేటి పిరుఁడవు ?

అభి—నాకు మేనమామపోలిక వచ్చుటచేతనే యింతవచ్చినది. నా మేనమామ తనయందత్యధికానురాగముగల రుక్మిణినిఁ జంకనిడికొంచుకొని వెంటవచ్చు విరోధివర్గమునకు శృంగభంగం బొనరించి రుక్మిణిని దక్కించుకొనెను. అట్లే నేనును నాయందధికానురాగముగల శశినిమిత్తమె ప్రియత్నింపక మానను. నీకు శక్తిగలదేని నన్నా ప్రయత్నమునుండి తప్పింపుము.

బల—ఓరీ వాచాటా ! నిన్నాప్రయత్నమునుండి తప్పింపవలయునా? అట్లయిన నాచాకచక్యము జూడుము. నీదుర్గతి జూచకొమ్ము. (అని రణమొనర్చుటకు సిద్ధపడును.)

అభి—ఓమరాగ్రహాయత్తచిత్తుఁడా ! ఈ కుఱ్ఱవాఁడేమిచేయఁగలఁడని యనుకొని రణమొనరించుటకు సిద్ధపడుచుంటివా ? నీ వనికి సిద్ధపడిన నేను వెనుదీయుదునా ?

ఉ. మామవు పెద్దవాఁడ వభి । మానధనుండవు నోట ముందు నా
భీమపరాక్రివిక్రిమము । వెల్లడిసేయుట నీతిగాదు కా
నీ మగవాఁడవైన నిఁక । నిష్ఠురవాక్యము లాడనేల ? నీ
వే మునుముందు గొట్టుమటు। వెన్క రణంబున నేను జొచ్చెదన్.

బల—ఓరీ ! డింభకా ! నీమొండిమాటలను విని తప్పక శిక్షింపవలయునని యున్నది. కాని బలరాముఁడంతటివాఁ డొకబాలునితో దలపడెనేయని లోకు లాడెదరేమోయని సంశయించుచున్నాను.

అభి—అట్టిసంశయ మున్నచో శశిరేఖను నాకిచ్చి యిల్లు దూరుము.

బల—ఆఁ! దుర్మదాంధా ! ఏమంటివి ? నన్నిల్లు దూరమంటివా ? అట్లయినఁ జచ్చుటకు సిద్ధముగానుండుము.

చం. తలపడుదాకనే మనకు । ధర్మములున్ మనవావివర్సలున్
నిలచును గాని యాపయిన । నిల్వవు జ్ఞాపక మించుకొమ్మ

అభి— ..............................................................వా
వులు తలపెట్ట కీక రణ । భూమిని వాని నిమిత్తమేల దు
ర్బలులకుదక్కు? రమ్మ బల । రామ! రణంబున నన్ను గెల్వుమా!

బల—ఛీ పాడుకట్టా! (అని ఖడ్గ మెత్తుచున్నాఁడు.)

అభి—(విల్లెక్కుచున్నాఁడు)

[వెంటనే సుభద్రయు గృష్ణుఁడును బ్రవేశించి కృష్ణుఁడు
బలరాముని సుభద్ర కుమారునిఁ బట్టుకొందురు.
శశిరేఖాదులు నిర్ఘాంత పడుదురు.]

కృష్ణు—అగ్రజా! కనుగందులో కదనం బొనర్తువా? ధర్మాపరావతారుఁడనగు నీవే యధర్మమున కొడిగట్టితివా?

బల (క్రోధముతో) కృష్ణా! ఈదురాత్ముఁడు రూపమున బాలుఁడై కనంబడినను మాటలాడుటయందు మేటియై గన్పడుచున్నాఁడు. ఇట్టివాని మదమడచుట యధర్మముగాదు. నన్ను విడువుము.

అభి—మామా! నామద మడంచునో, తననోటికి బుద్ధిసెప్పుకొనునో చూతము. వాని నాపక విడచిపెట్టుము.

సుభ—(కుమారుని బట్టుకొని) నాయనా! ఇదియేమి వెఱ్ఱి. పక్షవారెన్నఁటికినిఁ జెడ్డవారుగారు. మనప్రయాణమున కంతయు సిద్ధము జేసియుంచితిని. మన మిట నిలువవలదు. నీతండ్రిల చెంతకుఁ బోదము రమ్ము.

అభి—తల్లీ! నమస్కరించుచున్నాను. నన్నొక్కమారు విడువుము.

చ. కుడువగ కూడులేక తన । కొంపకు జేరితినంచు నూరకే
వశిపడి జ్ఞానశూన్యుఁడయి । పల్మరు నింద యొనర్చు వీనికీ

యెడ దగుబుద్ధిసెప్పుటకు। యెత్తినబాణము జిత్తబుద్ధుచో
బడుగుకుమారుగంటివని। వందురు నాపితగాన వీడుమా!

బల—కృష్ణా! వినుచుంటివా? నీమేనల్లుని యభిలాష మెట్లున్నదో? ఇంకను సందియ మెందులకు? నన్ను విడచి నీమేనల్లున కట్టి నిందరాకుండఁ జూడుము.

కృష్ణు—అభిమన్యూ! నాయందు విశ్వాసముగలవాఁడవేని మారు మాటాడక నీవిల్లమ్ము లిటు పెమ్ము.

అభి—మామా! నీ వట్లనుచుంటివిగాన నీయగ్రజునిచే క్షమార్పణ జెప్పింపుము. విల్లమ్ము లిచ్చివైచెదను.

శశి—(అభిమన్యుని చేతిలోని విల్లమ్ములు బట్టుకొని) ప్రాణేశ్వరా! నాయందు దయయుంచి యీవిల్లమ్ములు విడువుఁడు. కార్యవాదికి ఖడ్గములతో నిమిత్తమేమి?

అభి—(విల్లమ్ములు విడచివైచి) అమ్మా! మనము నాతండ్రిగారి చెంత కరుగుదము రమ్ము.

కృష్ణు—రథము సిద్ధముగానున్నది. దానిపైఁ బొండు.

అభి—నీదయ కనేక వందనములు. కాలినడకనే పోయెదము.

(అని తల్లితో నిష్క్రమించును.)

(తెర వ్రాలును.)

ఇది ద్వితీయాంకము.





# సంగీతశశిరేఖ.

## తృతీయాంకము.



### ప్రథమరంగము.

—॥ స్థలము:— ఘోరారణ్యము ॥—

[సుభద్రయు, నభిమన్యుఁడును నుండఁగాఁ దెర లేచును.]

సుభ—(ముందునకుఁ జూచి) కుమారా! మన మంతకంతకు ఘోరారణ్యములోనికి బోవుచున్నాము. మనము బాట తప్పియేయుందుము. నీతండ్రిగారున్న వనమునకు సరియైన త్రోవ నీకు దెలియదా?

అభి—(నలువైపులనుఁ జూచి) అమ్మా! క్షమియింపుము.

సీ. వగ యెఱుంగని నీవు । వగ జెందుచుండఁగాఁ
గనుచుంటి మొండినై । యనెడి దుఃఖ
మాత్మఁ బ్రేమ న । న్నరయు నాశశిబాసి
జనుచుంటి నడవుల । కనెడి వనట
బలరాముఁ డాడిన । పరుషవాక్యంబులు
విని యోర్చియుంటినే । యనెడి వంత
యొంటిమై మన మేఁగు । చుండఁగాఁ జినమామ
క[illegible]రకుండెనే । యనెడి చింత

యిట్టి కార్చిచ్చువలె జుట్టు । ముట్టి మిగులఁ
గూ్రరముగ నేచుచున్నట్టి । కారణమున
మనసు చెడిపోయె నందుచే । జనకులున్న
వనమెఱింగియు దప్పితి । బాట నమ్మ.

జననీ ! యిర్వదేండ్లుదాటిన నీసుతుఁడు నీచెంతనుండఁగా నోరులు నిన్ననరాని మాటలనుచుండ—నిన్నుఁ బరిభవించుచుండ— నీపరిభవానలము జల్లార్పఁజాలక—చేతగానట్లు తలవాల్చు కొని — వివేకశూన్యుఁడనై—పిఱికివాఁడనై — మాతృభక్తి లేనివాఁడనై—జీవచ్ఛవంబునై—సిగ్గుబిడియములు విసర్జించి— పరలోకమునకు దలవంపులుఘటించి—నాజనకుల కెనలేనియ పఖ్యాతిగూర్చి — మొండిదైయున్న నీనిర్భాగ్యుఁడు నీసుతుం డని యనిపించుకొనిన నీకు దలవంపులుగావా ? అమ్మా ! ఇ ట్టివ్యర్థజన్ముండనగు నేను నాజనకుని ముఖపద్మం బెట్టులవ లోకింపఁగలను? అవలోకించి తొంటియట్లాలింగనమొనర్చు కొనఁగలను ? ఆలింగనమొనర్చుకొని యాప్యాయము దీర ముచ్చటింపఁగలను ?

మ. “నిను నీతల్లిని కానిమాటలనుచున్ । నిందించి యున్నట్టిరా
మునిశిక్షింపక బ్రోవుమీయని కరం।బుల్ మోడ్చి యేమోముఖో
ననుఁ గాంచన్ దయజేసినాఁడవ”నుచున్ । నాతండ్రి నన్నాడునో
యనుదుఃఖం బెద బొంగియుండుటను న । మ్మా బాటనేతప్పితిన్.

సుధ—కుమారా ! ఎన్నఁడట్లు దలంపకుము. సమస్తధర్మాధర్మసం వేదియగు నీతండ్రిగారెన్నటికిని నిన్ను నిందింపరు. ఆత్మనింద మహాపాతకము. నిన్ను నీవు నిందించుకొనకుము. వెనుకటి విషయంబులెల్ల మఱచిపోయి సంతోషంబుతో నుండుము.

పడరాని మాటలు బడితినని నాకై విచారింపకుము. దైవదు
ర్విపాకంబున కెవరేమిచేయఁగలరు ?

అభి—అమ్మా! తొంటివిచార మెట్లణఁచుకొనఁగలను? నూతనానంద
మెట్లు తెచ్చుకొనఁగలను ?

సీ. పతితపావనుఁడనఁ । బరగుచుండెడి పాండు
రాజేంద్రునకు స్నుషా । రత్నమయ్యు
యీశునితోఁ బోరి । పాశుపతముఁగొన్న
ఫల్గుని మురిపెంపు । భార్యవయ్యు
విశ్వరక్షకుఁడయి । విశ్వాత్మకుండయి
వరలు శ్రీకృష్ణుసో । దరివియయ్యు
యిరుపార్శ్వములఁగూడ । నెనలేని బంధువ
ర్గముతో విరాజిల్లు । రమణివయ్యు
దిక్కులేనట్లు మిగులఁజిం । తిలుచు ఘోర
వనములం దిట్టు లిడుమలు । బడెదునీదు
సుతుఁడనై చేతగానట్లు । చూచు నాదు
మదికి యానందభాగ్యమె । ట్లొదవునమ్మ.

సుభ—తనయా ! ముక్కుపచ్చలారని చిన్నని సుంగువగు నీవేమి
చేయఁగలవు ? నాకొఱకై విచారింపకుము. నే కష్టములు బ
డుచుంటినని బెగడొందకుము. శశిరేఖకై నీవా బలరాముని
తోఁ బోరితివ యేని యన్నదమ్ములను నభిమానమైన లేకుండ
కొడుకు నుసికొల్పిన దని లోకులు నన్నాడిపోయుదురు. అట్టి
నింద నాపై లేకుండఁజేసితి వంతియేచాలును. అదియునుఁగా
క బలరాముఁ డవతారపూరుషుఁడు. అట్టివానిని నిగ్రహించు
టనిన సామాన్యవిషయము గాదు. వానిజోలి మన కేల ? మేన
ఱికమన్న ముచ్చటదీరునేమో యని యాతఁ డెన్నియన్నను

సహించి శశిని నీకిమ్మని మఱల మఱల యడిగితిని. మనమడు గుచున్న కొలఁది యాతఁడు బిఱ్ఱబిగియఁజొచ్చెను. కానిమ్మా మాంత్రిపుగన్య మనకు లభింపకపోవునా ? మనకష్టము లెల్ల కాల మిట్లే యిల్లుగట్టుకొని కాపురంబుండునా ? నాయనా ! నాకొఱకుఁగాని—శశిరేఖకొఱకుఁగాని విచారించి మనసు పాడుజేసుకొనకుము. ఇది మిగుల కీకారణ్యమువలె నున్నది. క్రొత్త యిడుమలు వచ్చి మనలఁ జుట్టిముట్టుకొనకము న్నే యీ ఘోరారణ్యమునుండి యావలబడు మార్గ మూహింపుము.

అభి—(తనలో) అక్కటా! అతిలోకసుందరిని—అజగన్మోహినిని—ఆషోడశకళాపరిపూర్ణచంద్రమండలమును బురడించు వదన బింబంబు గలదానిని—మెరపుదీవనుమించు తనుసోయగము గలమించుబోడిని—జననమందినదాది యొక్కకంచమున దిను చు—నొకమంచమునఁ బండుకొనుచు—దేహములు వేరైనను ఆత్మయొక్కటిగా జరించిన మాయనురాగవల్లరి బుటుక్కున త్రెంపివైచి యాసుగుణశిని—నాజీవంపురాసిని మఱచు టెట్లు ? ఇచ్చట మాతృవాక్యపరిపాలకుండ నగుట యెట్లు ? (అని నిర్ఘాంతపోయి యాలోచించుచుండును.)

సుభ—నాయనా ! శశిరేఖ నీహృదయ మందున్నంతకాల మీ యరణ్యమునుండి మనము బయటఁబడజాలము. కాన నామెను మఱచి—నీహృదయమునుండి యామెను బారద్రోలి—ముం దుదాటఁ దీయుము.

అభి—(తల్లినిజూచి కన్నీరు తుడిచికొనుచు) జనని ! క్షమించుము.

తే. గీ. బాల్య మెడలి యౌవనము పై । వ్రాలినప్పు
డొండొరుల ప్రేమ దీర్ఘమై । యుండునపుడు

వారిపెండ్లి కౌటంకంబు । వచ్చినపుడు
పొడముదుఃఖాగ్ని యార్పఁగా । బడునె జనని.

తల్లీ ! ఇట్లాడితినని నాపై గినియకుము. తల్లీ ! ఆవిషయమింక తల పెట్టను. బడబానలమును సముద్రుఁడు దాచినట్లు—నాచింతాగ్ని నాహృదయమందు దాచికొని ముందుకార్యముల కడ్డురాకుండ నడుచుకొనెదను. నీవనిన టీమహారణ్యము రాక్షసుల కునికిపట్టైనట్లు గన్పడుచున్నది. శీఘ్రముగా మన మియ్యెడ నుండి తప్పించుకొని పోవుటుత్తమము రమ్ము. పోదము.

సుభ—కుమారా ! మార్గాయాసంబున నెంతయో బడలియుంటిని. ఇంచుక విశ్రాంతిఁ గైకొనినపిమ్మటగాని నేను ప్రయాణము ను సాగింపలేను. కావున నాకనఁబడు సమతలంబునకుఁ బోయి కొంతవడి విశ్రమింతము రమ్ము.

అభి—జననీ ! అట్లే విశ్రమింతమురమ్ము. (అనినిష్క్రమింతురు.)

[తెర లేచును]

[సుభద్రాభిమన్యులు ప్రవేశింతురు.]

అభి—అమ్మా ! ఇచ్చట విశ్రమింపుము.

సుభ—(విశ్రమించును.)

అభి—(ఒక్కనిముషమూరకొని తనలో) శశీ! శశీ! నిన్నెట్లు మఱచిపోవఁగలను; లజ్జానమ్రత్వములచే మిగుల మనోజ్ఞములై విలసిల్లు నీ కోమలసుందర వదనమండలమును మఱచు టెట్లు? శరదాకాశఖండమువలె నిర్మలమై- స్వచ్ఛమై యలరారు నీ కనుబొమ్మలపైనున్న యాసుస్నిగ్ధలలాటమును మఱచు టెట్లు? అచంచలములైన నీ యోష్ఠాధరపల్లవములను మఱచు టెట్లు? చిగురుటాకుగలి రెప్పలనీడల మిలమిలమెఱయు నీ

కన్నుదోయి యనిర్వచనీయ సౌందర్యమును మఱచుటెట్లు? ఆహా! ఇదియేమి యన్యాయము. నీ వియోగదుఃఖప్రవాహ మునఁబడి దీనినుండి దరించుమార్గము లేక తపతపగొట్టుకొని కొట్టుకొని దీనిలోనే మునిఁగి నశించిపోవలసినదేనా? ఇఁక నుపాయాంతరము లేదా? మనమింక గలిసికొనుభాగ్యము లేదా ?

6 వ అనుబంధము.

అయ్యో! ఇప్పుడీ నిర్జనారణ్యమధ్యమున- ఈనిస్తబ్ధాకాశమధ్యంబున- అంతు దరి లేని మఃఖితోయఘంబడి.........అర్ధోక్తిలో-

[ తెరలో ]

ఓ పలలాశనులారా ! అస్మచ్చేనానీకములారా!

మ. నరులెవ్వారొ వనంబుజొచ్చి మనయా । జ్ఞక్ బొందకుండంగ ము
ష్కరచిత్తంబునఁ బాడొనర్చినగతిన్ । గాన్పించె మీ రేగి యా
దురితాత్ముల్ క్షమియింపుడీ యనుచు నెం । తో దీనతక్ వేడినన్
సరియే వీడక బట్టి చంపి తినుఁడీ । సందేహమున్ లేకొగిక్.

అభి—(ఇటునటుఁజూచి) ఓహో కార్యము మించివచ్చినట్లున్నది. ఈ రక్షోనాయకుఁడెవ్వఁడో నన్నల్పునిగా భావించి మమ్ము జంపుమని తన సేనావారమున కాజ్ఞాపించుచున్నాఁడు. రానిమ్ము. వారల గర్వంబడంచెదఁగాక. (అని విల్లమ్ములఁగైకొని లేచి నిలచును.)

[అప్పుడు నల్వురురాక్షసులు బ్రవేశింతురు.]

1. —రే. నరాధమా! ఇంకెందుబోయెదవురా?

అభి — రే ముష్కరాక్కడి తెక్కలిరాయులారా ! కాలు లరువక కాలునకు బుద్ధిసెప్పకొందురా? కాలుని వీటికేగెదరా? (అని నారి మోగించుచున్నాఁడు.)

2.—పోటుమాటలకు వెఱచువా రిందెవ్వరును లేరు.

అభి—ఛీఛీ! పేరిలకుండు. పోటుమాటలకుఁ బోకున్న నూటిపోటుల కైనఁ దలఁగకుందురా? (అని విల్లెక్కు-పెట్టుచున్నాఁడు.)

1—(క్రోధముతో) వ_క్త్రదంతా! నలువురు నాల్గువైపులను జుట్టి ముట్టడిసిపట్టి పోకచెక్క-వలె నోటఁ బెట్టుకొని కటకు-నన్నొక్క- గుటుక్కు-న మ్రింగివైచెదను.

(నలువురును నాల్గువైపుల జేరుదురు.)

అభి - మూర్ఖులారా! చావునకు దెగించితిరా?

1— పంచచామరము.

అరేనరాధమాధమా! యి । టాడుదేల కూళలై
పరాక్రమైనఁగాని నిన్నుఁ । బట్టి యిట్టు కూల్తురా!

అభి—

శరాసనేక బెనంగరంపు । శక్తియున్న లేనిచో
కరంబులెత్తి కావుమంచు । గాల్లపైన వ్రాలుఁడీ!

దుర్మదాంధులారా! ఈనడికాన నొంటిగా లభించితిననియు, బాలుఁడు గదాయనియు దలంచి చుల్క-నఁగా నన్ను మ్రింగింపవచ్చునని తలంచితిరేమో? ప ఱిపోయెదరా? బాణము విడచి మీ ప్రాణములు గొయుదుందురా?

2—పిట్టకొంచెము కూత ఘనమునా? మాచెద రేమిరా? పైఁబడుఁడు. బంధింపుఁడు.

అభి—దురితాత్ములారా! మీ కండకావర మడంచెదను. మాటలతో బోయెదరనుకొంటిని. మీ దురదృష్టమున కేమిచేయుంగలను.

(అని బాణము విడచును. ఒకడు చచ్చును.)

3.—(అభిమన్యుని పైఁబడును.)

అభి—(విదళించి దూరముగా బాఱవైచి యుత్సాహముతో)

ఉత్సాహ.

తులువలార రండు రండు । దుర్రిచివైతు నిప్పుడే
2.—పలుకులేల నన్నుఁ గెల్చి । పరిక్ష యేదొ జూపుమా!
అభి—బలముగలదే నన్ను గెల్వ । పాపహృదయ రమ్మికన్
2.—తలను మర్దించి పేర్గులూడ్చి । దాల్తు హారమట్లొగిన్.

(అని మీఁదపడబోవ బాణముచే గొట్టును. నేలవ్రాలును. తక్కిన యిర్వురును బాఱిపోవుదురు.)

అభి—ఆహా! ఈ మహారణ్యమునం దికను నిట్టికౄరరాక్షసు లెందఱు న్నారో గదా? వీరందఱును జెలరేగి పైఁబడకమున్నె నాజన నీకో నేనీ యరణ్యమును దాటిపోవుట శుభోత్కరము. అట్లు బోకున్న లేనిపోనియలజడి సంభవించుటయు, పెక్కుప్రాణ ములు పోవుటయు సంభవించును. నిష్కారణముగా జీవహాని కేల సిద్ధపడవలయును.

[తెరలో]

తే. గీ. నీచులైనట్టి నాదు సై । నికుల నెట్లొ
చచ్చిచెడి జంపి మదిలోన । మెచ్చుకొనకు
వచ్చుచున్నాఁడు రాక్షస । ప్రభువు నిన్ను
నల్లిగతి జంపఁగా నెంచి । యుల్లమందు.

అభి—(విని) ఓహోహో! వీడెవ్వఁడో రాక్షసరాజఁట. రానిమ్ము. రానిమ్ము. వీని తుత్తడగించెదఁగాక.

[ప్రవేశము:—ఘటోత్కచుఁడు]

ఘటో—(గదత్రిప్పుచు)

చ. [illegible]రపసువా! చలింపక కు । ణా బటువిల్చితివేని నీచ! నీ
శిరము బెకల్చి, గర్భమును । జీల్చి ముదంబున నీకుపేర్గు లీ

యురమును దాల్చి, కయ్యాలము । యూరక పారెడి రక్తవాహినుల్
జుఅజుఅ రెండు చేతులను । జుట్టి భటాళిఋణంబు దీర్చెదన్.

ఓరోరి మానుషాధమా! నిర్భయముగా సెలవైనలేకుండ నావనములో జొరబడి సీతాతగారి ముల్లెవోలె ననుభవించుచు, నంతతోఁ బోక నాభటులనుద్రుంచి నా కెన తీవిజ్ఞాభము దెచ్చిపెట్టితివి గాన నిన్నిప్పుడే సంహరించి నాపరాభవము జల్లార్చుకొంటయే గాక నాకొఱకయి నీకోటోరి వీరస్వర్గ మలంకరించిన నాభటుల ఋణముగూడ దీర్చుకొందును. (అని విల్లెక్కుబెట్టి) ఓ శూరమన్యా! ఇదిగో! నేనిప్పుడు విడచుచున్న నాబాణాగ్ని నించుక చవిగొని నీచేజచ్చిన నాభటులన్ను శరణంబు వేడు టకై స్వర్గపురంబునకుఁబొమ్ము. (అని బాణమును విడచును.)

అభి (బాణమునుఖండించి) ఓయభిమానధనుఁడా! ఆత్మస్తుతి యొన ర్చుకొనకుము. నీబాణ మేమైనదో చూచుకొమ్ము.

మ. తులువా! నీతలదన్నినట్టి ఘనుడై । త్యల్ జేతగానట్లు చే
తులు జోడించి క్షమింపుమీ యనుచు । నెంతో దీనతన్ నాపదం
బుల వ్రాలంగను జేసినట్టి బలుఁడం । చున్ నన్ను గుర్తింప కెం
దుల కైపోరెదు? పోరుచోఁ బడెదు మృ । త్యుద్ఘోరదంష్ట్రింబులన్.

ఘటో—ఓనరాధమా! ఒక్కకలగనఁగనే తెల్లవారినదని తలంపకు ము. నాబాణ మొకటి ఖండించి వీరాగ్రేసరుఁడనని వీగెద వేల రా దుర్మతీ! (అని బాణమెక్కుబెట్టి) ఈమారు నీచాకచక్య మేదియో చూచెదను.

కవిరాజవిరాజితము.

పరుగిడి పాఱిన పాదములంటిన । బాణము చే[illegible] దుంచెదరా
అభి — పరుషపుమాటలు బల్కఁగనేటికి । బాహుబలంబది జూపుమురా
ఘటో—సరిసరి శూరుఁడనంచెద నెంచి ది । సంతల[illegible]ద వేటికిరా

అభి—బిఱబిఱరమ్మిఁక బీరము లేటికి । భీముపరాక్రమ ముందు నెడల్.
ఘటో—ఓరీ డింభకా!

కం. కాలుఁడు పేరి రేపఁగ నీ
పేలాగునఁ బెద్దపిన్న । లెరుగక ననికిన్
గూళా! సిద్ధంబయితివి
కాలము దాపయ్యె రమ్ము । గండడగింతున్.

అభి—ఓరీ! గాకుసాధమా! మదించితిరుగు మత్తగజేంద్రంబుపై బహు. టకు సింగపుబిల్ల యెప్పుడును సిద్ధంబైయుండుననియే భావించుము. ఒక్కపోటునకు శోధనను, వయసుతోడను బని లేదని యెఱుంగుము. ఓపలలాశనా!

క. ఉసికూత లిట్లుగూసినఁ
బసువా! నినుఁబట్టి నేఁడు । భండనభూమిన్
గసిమసఁగఁగఁ జేసెదనీ
యశిచే, నిన్గావ లేరు । హరిహరులైనన్.

ఘటో—ఓరిగురాత్మా! ఏమాకండకావరము.

క. మాటకుమాటయు నాడెఁగఁ
బోటరి పీడనుచు నెంచి । పోఫ్రదునంచున్
నీటుగ దలఁచిన యోవా
చాటా! నినుఁగూల్తు నిపుడె । సంగరమందున్.

(అని మీఁదికుఱికి కలియఁబడుచున్నాఁడు. అభిమన్యుఁడుగూడఁ గలియఁబడును. ఇరువురును ద్వంద్వయుద్ధము జేయుచుండఁగా సైనధ్వనివిని సుభద్ర మేల్కాంచిచూచి)

సుభ— 7. వ. అనుబంధము.

అయ్యయ్యో! నాసుతు నిప్పట్ల రక్షించువారు లేరా?

నార—(శీఘ్రముగాఁ బ్రవేశించి) ఎవ్వరిదీ యార్తధ్వని. (అని ముం

దునకుఁజూచి) ఓహోహో! ఈమె పాండవమధ్యముని పట్ట మహిషియగు సుభద్ర. (అనిసమీపించి) అమ్మా! నీకిప్పుడు వచ్చిన యాపదయేమి?

సుభ—మునీంద్రా! వందనము. అదిగో గాంచుఁడు. పసివాఁడగు నా కొమరునితో బెడగొండవంటి రాక్షసుఁడెవ్వఁడో పోరుచుం డెను. మునీంద్రా! నాకుఁబుత్రభిక్ష పెట్టి నన్నునుగ్రహింపరా.

నార—అమ్మా! నీకువచ్చిన భయమేమియు లేదు. వారిని శాంతిదే ర్చెద. (అని వారినిసమీపించి) ఓడింభకులారా!

తే. గీ. పాండురాజేంద్ర మనుమలై । వరలుచుండి
యన్నదమ్ములరై మీర । లలరుచుండి
కారణములేక యూరకే । పోరఁగడఁగు
చుండి రిదియేమి చోద్యమై । యుండునయ్య.

రెండు రెండు. అన్నదమ్ములు పోరాడవచ్చునా?

(ఇరువురును యుద్ధము మానుదురు.)

ఘటో—అయ్యా! మేమిరువుర మన్నదమ్ములమా? ఇదేమిచోద్యము!

నార—ఇందేమి చోద్యమున్నది? నీవు హిడింబాభీమసేనుల సూనుం డవు. ఈతఁడు సుభద్రార్జునుల కుమారుఁడు. ఆమె మీపిన తల్లి.

ఘటో—ఆఁ. ఆఁ. ఈతఁడు నా సోదరుడగు నభిమన్యుఁడా? ఆమె నాపినతల్లియగు సుభద్రయా! కట్టా! తెలియ కెంతద్రోహ ముగావించితిని. (అని అభిమన్యునిఁడాసి) సోదరా! పిన్నవాడ వగుట నిన్ను వేఁడుకొనరాదు గాని నాయవివేకమును మన్నిం పుము. (అని సుభద్రనుడాసి కాళ్లపై వ్రాలి)

శా. అమ్మా! యెన్నటికిన్ క్షమింపఁబడఁగా । నర్హంబుగానట్టి కా
ర్యమ్ముల్ జేసితి మందబుద్ధినయి నా । యజ్ఞానమున్ సైచి వ

న్నెమ్మాడ్కిన్ దయజూతువో తలప నీ । దేభారమో తల్లి! పా
దమ్ముల్ ముట్టిన సూనునిఁ మనుచు టే । ధర్మంబుగా మాతకున్.

సుభ—(ఘటోత్కచుని లేవదీసి) కుమారా! నీకు నీ సోదరునియు
దంతము తెలియకునికి బోరితివి. తెలిసి పశ్చాత్తాపబడుచుం
టివి. పశ్చాత్తాపమె పదివేలు. నీయం దేదోషమును లేదు.
ఉన్నదని నీవనుకొన్నచో మనఃపూర్వకముగా క్షమించితిని.

ఘటో—మునీంద్రా! నాజనని నన్ను క్షమించినది. వీరాకట నకనక
లాడుచున్నారు. వీరిని వేవేగ నా యాశ్రమమునకుఁ దోడ్కొ
ని పోవలయును. క్షమించి తమరుగూడ విచ్చేయుదురుగాక
యని ప్రార్థించుచున్నాను.

నార — వత్సా! నీ యభిమానమున కెంతయో సంతసించితిని. నేని
చ్చటాగుటకు వీలులేదు. నేఁటిరేయి ద్వారకలో బలరాముని
కొమార్తెయగు శశిరేఖకు వివాహముగానున్నది. అచ్చట
కు వెడలవలయును.

ఘటో—అమ్మా! శశిరేఖ నీ కోడలంటివిగాదా?

సుభ— నాయనా! ఆ యదృష్టము దూరమైనది. కౌరవు లైశ్వర్యవం
తులని బలరాముఁడు వారిసంబంధమున కిచ్చగించెను.

ఘటో—మునీంద్రా! వివాహ మీరాత్రియేనా?

నార—అగును.

ఘటో—అట్లయిన మీరు వెడలుఁడు. ఆ వివాహ మెట్లగునో చూచు
టకై నేనును దప్పక వచ్చెదను.

(అందఱును నిష్క్రమింతురు.)



## ద్వితీయరంగము.

—| స్థలము—ఘటోత్కచాశ్రమము |—

[సుభద్రాభిమన్యులును, హిడింబీఘటోత్కచులును గూర్చుండి యుండఁగాఁ దెఱ లేచును.]

హిడిం — సోదరీ! అన్నగారింత దౌర్జన్యమున కొడిగట్టిరా?

సుభ — అక్కా! అన్నగారొక్కరే మనకు వ్యతిరేకాభిప్రాయులై యున్నారు. నీకిది కూడదని యాబాలగోపాల మాతనితో వాదించిరి. ఎవరు వాదించిన నేమిలాభము? కౌరవుల గుణగణాదు లెట్టివో యెఱుఁగనివాఁడు గనుకనా నచ్చచెప్పుటకు. అట్టిదేమియును గాదే. శశిరేఖ నభిమన్యున కిమ్మని చెప్ప వచ్చినవారినెల్ల నేదియో యొకవిధముగా బరిభవించుచునే యుండెను. ఇదియదియని వచింపుటకు వీలులేదు.

మ. ఒకమాటా? యొకలోకమా? చెలియలం| చూహించుటా? విన్న వా
రికికష్టంబగు నేమొ యన్నభయమా? | ప్రేమాస్పదంబైన పు
త్రిక దుఃఖంచునటన్న ఖేదమ? యదే | దీలేక బ్రాల్మాలి యా
రక నిందించుచు బిడ్డతోఁ గదిసిబో | రణ జొచ్చె నొక్కమ్మడిన్.

ఘటో — (క్రోధముతో)

శా. ఏమేమీ! బలరాముఁడే చెనఁటియై | యిట్లెంతయో దిట్టి తా
నే మాత్రంబును సంశయింపక కటా! | యీకుట్రనిన్ గొట్టఁగా
నామూర్ఖుం డెదనెంచెనే, సరియె నే | నాపాపునింబట్టి నేఁ
డేమన్నింపక శిక్షజేసి శశి నె | ల్లేఁ దెచ్చి నీ కిచ్చెదన్.

అమ్మా! మా చిన్నమామ యభిప్రాయం బెట్లుండెను?

సుభ — నాయనా! ఆలోకారాధ్యునకు మీయెడలను మీపితలయెడలను నమితానురాగముగదా? అట్టివాఁ డభిమన్యున కెన్నటికైన నపకారంబొనర్చునా? బలరాము డట్లు భీష్మించుకొని

యున్నప్పుడు మా చిన్నన్న యాతని కెన్నియోవిధముల బోధించెను. తాను న్యాయపక్షపాతినని జెప్పెను. కౌరవు లన్యాయవర్తనులనియు, వా రధోగతి పాలగుదురనియు జెప్పెను. ఎన్ని చెప్పిన నేమిలాభము. ఆతని మొండిపట్టాతఁడు విడువలేదు. దేవకీదేవి యాతనిఁ గాంచి నాయనా! కృష్ణుఁడు సత్యసంధులగు పాండవులపక్షమై యుండఁ గౌరవసంబంధ మాకాక్షింతువేల యనియడుగ—

"పాండవపక్షమూని"— (అనుపద్యముఁ జదివి)

యిట్లు సమాధాన మిచ్చెను.

ఘటో—సరే. పెద్దత్తగారియభీష్ట మెద్దియో తెలిసికొంటివా ?

సుభ—ఆమెయు నభిమన్యునిపైననే యభిమానముఁ గలిగియున్నది గాని మహాపతివ్రతగాన పతిమాట కడ్డుబలుకఁజాలక—దైవనిర్ణయమున కెదురుజూచుచు—వగచుచు నూరకున్నది.

ఘటో—సరిగాని—మామఅదలి యభిప్రాయమేమి?

సుభ—అయ్యో వెఱ్ఱితండ్రీ ! మామఅది యభిప్రాయము మఱొకరీతిగా నెట్లుండును.

శా. ఈవాక్యంబును విన్నదాది మదిలోఁ నేగుబ్బుచున్ దండ్రితో
నే వాదించెను, తల్లికౌఁగిటను నెం తేదీనతన్ జేరి పెం
ద్లే వద్దంచును మొఱ్ఱబెట్టుకొనె వా రీవాక్యముల్ త్రోయనో
బావా! తోడ్కొనిపొమ్మటంచుమిగులం బ్రార్థించెనీతమ్మునిన్.

ఆమె చెలికత్తియలుగూడ నామెకోర్కెనే బలపరచిరి. సర్వమును సిద్ధమైయుండ లలితయను దాసి యీసంగతినెల్ల గ్రహించి రహస్యమును బలరామున కెఱింగించివైచెను. దానితో బలరాముం డుగ్రుఁడై వడివడి జనుదెంచి నోటికిరానిమాటలని నీసోదరుని నిందించెను.

ఘటో—తమ్ముఁడా! అన్నునిందించిన బలరాముని నాల్కకు బుద్ధిసెప్పక విచ్చేసితివా?

అభి—అగ్రజా! నేనట్టి యభాగ్యుఁడను గావలసివచ్చినందులకు మిగుల లజ్జించుచు నేయున్నాను. అమ్మగారి యాటంకము హెచ్చెను. మామఅదలు చేతులున విల్లమ్ములఁ బట్టుకొనియెను. చిన్నమామ "నాయందు విశ్వాసముగలవాఁడవేని విల్లమ్ములిటు వెయ్యు" అనియెను. ఇంకేమి చేయగలను?

ఘటో—అటులయిన నీయెడ దోషంబేమియు లేదు. ఈయుదంతము జనకులాలించినను నేమియుననరు. అమ్మలారా! అపరాహ్ణకాల మతిక్రమించినది. నేఁటిరాత్రియే శశిరేఖ వివాహము. నేనయ్యెడ కరగి మామరదలును దీసికొనివచ్చెదను. ద్వారకానగరములో గావలసిన వివాహ మిక్కడ గావలయును. శశిరేఖవివాహమునకై సిద్ధపఱచిన సామగ్రియంతయు నిక్కడుండవలయును. దానికి దగినసన్నాహమంతయుఁ జేయవలయునుగాన నేను నాభటులతో నిప్పుడే వెడలెదను. నన్ను దీవించి పంపుము.

హిడిం—సర్వదేవతలును నిన్ను రక్షింతురుగాక. నీతాఁబూనిన సత్యదీక్ష నిర్విఘ్నముగాక వెడలిరమ్ము.

అభి—అగ్రజా! నేనుఁగూడ నీవెంట రావలదా?

ఘటో—సోదరా! నీవేమియు శ్రమపడవలసిన యగత్యము లేదు. నీవిప్పుడు పెండ్లికుమారుఁడవు. ఇట్టిసమయంబున నీవు శ్రమపడుట తగదు. నీవు తల్లులఁ గనిపెట్టుకొనియుండుము. అమ్మలారా! నేను శశిరేఖను దోడ్కొని వచ్చులోపల సోదరునిఁ బెండ్లికొమరునిఁ జేయుఁడు. అమ్మా! కరాళదంష్ట్రిన కంతయు జెప్పి వెడలెదను. వాఁడు వివాహవేదికయుఁ బందిరియు సింకను

నలయుతోరణములు నన్నియు వాఁడొనర్చును. వాఁడు మఱచినవేమైన నున్నచో జ్ఞాపకమొనర్పును. నే వెడలివచ్చెద.

(నిష్క్రమించును)

8. వ. అనుబంధము.

**హిడిం**—సోదరీ ! సుతుం డీపాటికి ద్వారకానగరముఁ జేరియుండును. అభిమన్యుకుమారునిఁ బెండ్లికొమారునిఁ జేయుదము రమ్ము.

**సుభ**—మంచిది రమ్ము. (అందఱు నిష్క్రమింతురు)

[ తెర లేచును.]

[వివాహాలంకారములతో నభిమన్యుఁడును, సుభద్రా హిడింబును బ్రవేశించుచున్నారు.]

**సుభ**—సోదరీ ! పరమేశ్వరవిలాస మెట్లున్నదో జూడుము.

ధృ వ కో కి ల.

అనుజుఁ డాగతిమాటలాడ గృ । హంబువీడి విచారతన్
వనములంబడి చిక్కులందుచు । వాతతోఁ గృశియించుట
య్యెనునిజంబుగ మీరుపాప్రయి । యిట్టిఖేదమడంచి మ
మ్మనునయంబున బ్రోచియుంటిరి । యాక్షణంబున బ్రేముడిన్.

పరమేశ్వరవిలాసమే దీనికి కారణముగాకున్న సమయమున కానారదుఁ డరుదేరకనే యుండును. మనకిట్టి యానందం బొడగూడక యుండును.

**హిడిం**—సోదరీ ! ఎవరియాత్మీయులను వారు రక్షించుకొను టొకగొప్ప గనముగా దలంపకుము.

**సుభ**—అక్కా! అగ్రిమసుతుం డరిగి చాలతడవయ్యెను. ఈపాటికి రావలయును గదా ! ఇంతయాలస్యంబైన దేమికారణమో ?

**హిడిం**—అమ్మా! వెడలుటకొక్కనిముషమును, తిరిగివచ్చుట కొక్కనిముషమును జాలును. ఇదివఱ కెన్నఁడా శశిరేఖను వాఁడు

జూచియెఱుంగఁడు. అందుచే నామెను గుర్తించుటకై యాల స్యంబయియుండును. అదియు నీపాటి కైయుండును.

[అప్పుడు ఘటోత్కచుఁడు శశిరేఖ పరుండినమంచము శిరముపైనిడుకొని ప్రవేశించి మంచము డింపి]

ఘటో—(సుభద్రఁ జూచి)

శా. తల్లీ ! ద్వారక కేగి మ్రొక్కి మెుగి సౌ । ధం బల్లగాలించి యీ
ఫుల్లాబ్జాక్షి యె నీమకోడలను చున్ । మట్టుగ రాదంచు నా
యుల్లంబందుఁ దలంచి తల్పముసహా । యుద్వృత్తుగా నెత్తి మీ
త్రొల్లన్ దెచ్చితి గాంచు మిందునను సే । మీ మోసపో లేదుఁగా?

సుభ—(మంచమును సమీపించి ముసుఁగుదీసి చూచి సంతోషము తో) కుమారా ! సంతోషము. నీవు మోసపోదువా ?

చ. త్వరపడి నీకు తమ్ముఁడని । భావమునన్ గ్రహియింపలేక సం
గరమొనరించి జంపుటకు । కార్ముక మెత్తినపాపవల్లరుల్
దరిగెనొ తమ్మునకుట్టునకు । దారనొసంగి గృహస్థుఁ జేయుటన్
ధరణి చిరాయురున్నతులు । దాల్చి సుఖంబున నుండు మింక పుత్రకా!

ఘటో—అమ్మా! నీయాశీర్వచనమమోఘముగుఁగాక.

అభి—అన్నా !

తే. గీ. నిన్నుఁ దెలియకదురమునం । దెన్నొగతుల
నొవ్వనాడితి సైచి న । న్ను దయగనుము
నీదుసుపకారబుద్ధికి । నాదుచర్మ
మొలచియిచ్చినన్ దీర । గలదె ఋణము.

ఘటో—సోదరా! తప్పు. తప్పు. అట్లనకుము. బాంధవ్య మెఱుం గకమున్ను నిన్ను నేనుమాత్రము ముద్దుబెట్టుకొంటినా ? తెలిసినపిమ్మట గూడ నీవు నన్ను బొలియింపనెంచితివా ? ఏ మియులేదు. పెద్దవాండ్రెప్పుడును జిన్నవారి క్షేమోదంత

మారయుచుండవలసినదే. అది వారి విధ్యుక్తధర్మము. అట్లు చేసితిమని వారిలో వారు గర్వించుటగాని—పిల్లలచే బొంగడించుకొనజూచుట గాని యధర్మము..............అమ్మా! ద్వారకానగరములో నీమెవివాహామునకై కూర్పఁబడిన సమస్తవస్తువులు నాసేవకులు దెచ్చిరి. వానితో నేఁటిరేయి వివాహము గావింపవలయును. పెండ్లికందఱను దోడితెచ్చెదను, బలరామునిచేతనే కన్యధార పోయించెదను. నేనువెడలి కౌరవులముచ్చట నించుక గాంచి, భగ్నమనోరథుండైన బలరాముని వదనబింబం బొకమారు గాంచి, వారినెల్ల నవ్వులబాలొనర్చి శ్రీకృష్ణాదుల నెల్ల దోడితెచ్చెదను. మీరు మీపరియత్నమున నుండుఁడు. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

సుభ — (శశిరేఖను సమీపించి) అమ్మా! శశిరేఖా! లెమ్ము. లెమ్ము.

శశి—(దిగ్గునలేచి యిటునటుజూచి తనలో) హా! ఏమిది? నేనీస్థలంబున కెట్లువచ్చితిని. ద్వారకలో నేను నారమ్యహర్మ్యంబున. బరుంటినిగదా? అగును. నిశ్చయముగా నచ్చటనే బరుంటిని. అట్లయిన నేను మేల్కొనియుంటినా? కలగనుచుంటినా?... నేను మేల్కొనియుంటిననునది నిర్వివాదాంశము. ఏదియో మోసము జరిగినది. (ఇటునటుఁజూచి) ఇదిగో! నామేనత్తయు నాబావయు నిచ్చటనే యున్నారు. వీరిచెంత నెవ్వతియో రాక్షసాంగన యొర్తున్నది. (స్మృహనభినయించి) ఓహో! నాబావయు, యత్తయు నీరాక్షససహాయముఁ బడసి వారిసహాయ్యంబున నన్నిటకుఁ దెప్పించిరి. దీన సందేహము లేదు. (అని గుభీమనిలేచి) అత్తా! నాకు భయమగుచున్నది. రక్షింపుము (అని యొడిలోఁ బడును.)

సుభ—అమ్మా! భయపడకుము.

క. నినుఁ బాసియుండఁజాలక
మనమునఁ జింతించుచు నభి । మన్యుఁడు నిన్నీ
వనములకున్ రప్పించెను
కని, బావను సంతసంబు । గాంచుము తల్లీ !

శశి — అత్తా ! సంతోషము.

ఉ. కోరినవానియండఁబడి । గొప్పసుఖంబులు గాంచుభాగ్యమీ
ధారుణి నాకు లేదని, య । ధైర్యము జెందుచుఁ దల్లితండ్రులా
తీరునఁ జేసిరంచు నిఁక । దిక్కొకసుంతయు లేదటంచు నే
నూరక యేడ్చుచున్నతరి । నొప్పుగ బ్రోచితి రెంతొ ప్రేముడిన్.

మీరెల్లనన్నిట్లాదరింపకున్న నేనీరేయి నిశ్చయముగా జావనుంటిని. చచ్చుటకు సిద్ధముగా నున్న నన్ను రక్షించి — నాయాశయ ముదీర్చిన మీయనూనకరుణాకటాక్షవీక్షణముల కేనెంతయు గృతజ్ఞురాలను.

అభి — అనూనకరుణ యేమి ?

శశి — అత్తా ! ఈసాధ్వి యెవ్వరు ?

సుభ — ఆబిడయే మీపెద్దత్తగారు.

శశి — అట్లనా ? (అనిలేచి నమస్కరించును)

హిడిం — దీర్ఘసుమంగలీభవ !

సుభ — ఈమెకుమారుండును, నీబావగారును నగుఘటోత్కచుఁడే నిన్ను దోడితెచ్చెను.

శశి — అత్తా ! మీరు వెడలిపోయినపిమ్మట నాజనకుఁడు నన్నునేక విధంబుల వేధించుకొనితినియెను. ఎందరెన్నివిధముల బోధించినను దనవెనుకటి పట్టించుకయు విడక — బోధించినవారినెల్ల నిందింపఁజొచ్చెను. ముష్కరాధములగు కౌరవులు విచ్చేసి చతుర్మతీభవనమున విడిదిదిగిరి. మంగళస్నానములవ

నిరీక్షింపఁదలచితిని. అప్పటికిని నాకోర్కెదీరు సాధనములేని చో నెట్లో, నీయసువులు——

అభి——శశీ ! వలదు. వలదు. ఆమాట నీనోట ననవలదు. పరమేశ్వరుఁడు న్యాయపక్షపాతి. ఆసంగతి పరమేశుండగు నీపినతండ్రియే నీతండ్రి కెఱింగించెను. అప్పు డామాట యగాతనితల కెక్కినదిగాదు. ఇంకేమిజేయును.

శశి——చేయుట కేమున్నది ?

క. తనయాశయమెల్లను ని
ట్లనువుగ వమ్మయ్యె ననుచు । న దఱిఁగోనన్
దనతల యెత్తుక తిరుగక
ననయము సిగ్గుఁబడి మూల । నడఁగును తుదకున్.

హిడిం——అమ్మా ! పెద్దల నట్లు నిందింపవచ్చునా ?

శశి——అత్తా ! నాకడుపు మండుకొనిపోవుచున్నది. నన్నును, నా యత్తమామలను, నాభర్తను నాతండ్రి నిందించినదానిలో శతాంశమైనను నేనన లేదు. అతని నేమన్నను బాపము లేదు.

సుభ——అక్కా! శశిని స్నానము జేయింతము రమ్ము (అందఱును నిష్క్రమింతురు.)

(తెర వ్రాలును)

ఇది తృతీయాంకము





శ్రీ

# సంగీత శశిరేఖ.



## తురీయాంకము.



### ప్రథమరంగము.

— స్థలము : — శశిరేఖాంతఃపురము. —

[ఘటోత్కచుఁడు మాయాశశిరేఖయై కూర్చుండి యుండఁగాఁ దెర లేచును.]

మా-శ — (తనలో) అమ్మయ్యా! ఇప్పటికి చేయవలసిన యన్నిపనులును జేసి శశిరేఖరూపముతో నిప్పటి కియ్యంతఃపురమునఁ గూర్చుంటిని. (మృదంగధ్వని విని) అదిగో! పెండ్లివారు లగ్నమునకై వచ్చుచున్నట్లున్నది. ఔరా! వీరెంత బుద్ధిలేనివారు? మే మొసంగిన మాయావస్త్రంబుల గ్రహించి వారివారి యమూల్యవస్త్రంబులన్నియు మాకొసంగిరి. నాయనుచరులెల్ల నిక్కమగు వర్తకులే యనుకొని యిరుకక్షులవారును గూడ పూర్తిగామోసపోయి వస్త్రములు-వస్తువులు-అగరునూనెలు-అత్తరుపులు- పుష్పహారములు మధుపర్కములు — ఒకటేమి యన్నియు దమయొద్ద నున్నవానికంటె మాయొద్దనున్నవే నాణ్యమైనవని తలంచి యన్నియు మార్చిరి. మాయ మాయలో లీనమైపోయి నిజము బైటఁబడినప్పుడు వారివదనంబు లెట్లుండునో జూడవలయును. వివాహమునకు వలయు

సమస్త మిట్లే సంగ్రహించి నా యాశ్రమమునకుఁ బంపించివైచి తిని. ఇంకిచ్చటి వివాహమహోత్సవ మెట్లుగాఁ బరిణమించు నో చూచి యాపైన నిజముగ శశిరేఖాభిమన్యుల వివాహ మున కరుగవలయును. (వినుట నభినయించి) అదిగో! ఎవ్వరో వచ్చుచున్నారు. ఇప్పుడు నాశశిరేఖపాత్రమును నేను చక్క గా నభినయించి వీరి కెంతమాత్ర మనుమానము గలుగ కుండునట్లు జేయవలయును.

[ తెరలో ]

రూపలతా! శశిరేఖ యేమిచేయుచున్నది?

మా-శ—(బిగ్గఱగా) ఏమిచేయుచున్నదా? నెత్తియు నోరును గొట్టు కొని యేడ్చుచున్నది. తన యాశాలత చచ్చినదని తలచు కొని, తలచుకొని యేడ్చుచున్నది. పరమేశ్వరా నా కిట్టిదుస్థి తి తెచ్చిపెట్టుచుంటివా యని వెక్కివెక్కి యేడ్చుచున్నది. తండ్రిగారి క్రోధాగ్నికి తన సౌఖ్యమాహుతియై పోవుచుం డెగదా యని కుమిలికుమిలి యేడ్చుచున్నది. తనతల్లి కుండ వలసిన గర్భవాసపుతీపి గంగఁ గలసిపోయినదిగదా యని కం టికి మంటికి నేకధారగా నేడ్చుచున్నది. అవతారపురుషుఁడని యఖిలజనంబులచే ననుకొనఁబడుచున్న నా పినతండ్రియగు శ్రీకృష్ణునకే నాయం దభిమానము లేకపోయెగదా యని పొరలి పొరలి యేడ్చుచున్నది. బంధువర్గమెల్ల నాతండ్రికే దాసులైపోయిరిగదా యనియు- నాతండ్రి ధనమునకు దాసుఁ డైపోయెగదాయనియు దలంచి తలగొట్టుకొని యేడ్చుచున్న ది. దౌర్భాగ్యుండగు దుర్యోధనున కీదురాశ యేల గల్గినదా యని పనవిపనవి పలవించుచున్నది. అతివనై జన్మించుటచే నస్వతంత్రురాల నైపోతినిగదా యని కుళ్ళికుళ్ళి కుతమా

రిపోవుచున్నది. నా గొంతుక నిల్లేల గోసితివి దేవుఁడా యని దేవులాడుచున్నది. నా కింకేమున్నదమ్మా ! బలవంతంబుగ నాల్గుమెతుకులు ముంబంటకొరకుట-నాల్గుకడవలు నిండునటుల కన్నీరుగార్చుట— నా కహోరాత్రిము లింతకంటె పనియే మున్నదమ్మా!

[అప్పుడు కనకలతా రేవతులు బ్రవేశింతురు.]

రేవ —కనకలతా! నీ వెట్టిగాని నే నేమిచేయఁగలను?

మ. సుతదుఃఖంబును గాంచికాంచి మదిలో । శోకించుచున్ యెట్టులీ
వెత జల్లార్తునటంచు నెంచుచును నే । వేరీతు లిందందునన్
మతిలేనట్టుల తిర్గ నేనెటుల స । న్మానింతు వియ్యాలవా
ర్ని, తలంపం గడుదుఃఖభాజనముగా । స్త్రీజన్మ మీాధారుణిన్

తే. గీ. పతిహితంబున కడ్డంబు । బల్కలేను,
సుతవిచారంబు గండ్లార । జూడలేను,
హాని కెటు సౌఖ్యమెుదవునో । తలఁపలేను,
యేనుజేసెడి దేమెు యూ । హింపలేను.

కన — అమ్మా! అన్నియు సిద్ధమైనవెనుక నింక విచార మెందులకు? ఇప్పుడెంత విచారించిన నేమిలాభము? దైవయత్నమట్లున్నది. దానికి మీారేమిచేయఁగలరు? మీారేగాదెవ్వరైన నేమిచేయం గలరు ?

మా-శ—(విని) కనకలతా ! అన్నియు సిద్ధమైనవెనుక నింక విచార మెందులకనియా? ఉరగముచే బట్టఁబడిన మండూక మెందుల కార్చుచున్నది? తప్పించుకొనఁగలనను నాశ దానికేమైన నున్నదా? వుండుట కవకాశమున్నదా? ఏమియు లేనప్పు డది నిర్విచారముగాఁ జావరాదా? దానికాయేడు పెందులకు? నడిసముద్రములో నిరాధారుఁడై బడినవాఁడు "తపతప" కొట్టుకొని

గొంతెత్తి యేడ్చు టెందులకు? బ్రతుకుదునను నాశకాని— ఎవరైన రక్షింతురను నపేక్షగాని వానికున్నదా? లేదే! అట్టియెడ నీళ్ళు మ్రింగి నిర్భయముగా జావ కెందుకాతనికాగి జాయిపు? దాన నేమిలాభమున్నది? ఆకస్మికముగా ఖడ్గముతోనరుకబడి శిరమును, మొండెమును వేరుజేయఁబడినప్పు డవి రెండును గిజగిజ తన్నుకొనుటెందులకు? ఆ తెగినశరీరము కన్నీరు గార్చుటెందులకు? మఱల బ్రతుకుదునను నాశ తనకు లేదుగదా? అట్టి యాశలేని దేడ్చుటెందులకు? నవ్వరాదా? కష్టమువచ్చినప్పుడు విచారింతురుగాని కష్టము ముందెప్పుడో వచ్చునని విచారింతురా? అట్టిమూర్ఖు లుందురా? గోష్ఠముండవు నీకు గర్భవాసపుతిపి యెట్లు తెలియును. నాకొఱకు విచారించుట కీమహాసాధ్వియొక్కతెయే యున్నది. ఆమెను వారించిననింక నధోగతిపాలొనర్చుచుంటివా?

రేవ—(విచారముతో) అమ్మా! నాకు నీయందున్న ప్రేమ మొకరు తప్పింపఁ గలరా? తల్లీ! దైవయత్నమున కెవరేమి చేయుదురు? కష్టకాలము వచ్చినది గదా యని విచారించుటుంటెంతవారికిని దప్పదు. కొంతకాలమున కాకష్టము లే సుఖదములై గానిపించును. ఇంతవఱకు వచ్చినపిమ్మట నిఁక విచార మెందులకు? పెండ్లివారెల్ల విచ్చేయుచున్నారు. ముహూర్తము సమీపించినది. ఇంక విచారింపకుము తల్లీ! (అని లాలించును)

మా-శ—జననీ! మఱల ప్రారంభించితివా? నాకీదిక్కుమాలిన వివాహమునెడల నిష్టము లేదు. అభిమన్యాధీనమై యున్న నాచిత్తమన్యాయత్తము జేయుట నాతరముగాకుండ నున్నది. ఆయాస నాకు నిరాసయయ్యెను. ఇఁకేటి కీసౌఖ్యము—

భ. జనకుఁడు నారొయెడఁ [illegible]కుల । జాలిప[illegible] యున్నవాఁడు నా మనమునఁగోరినట్టి సుతు । మారుఁడు కానల శ్రీయుండె యెం దునను సుఖించుమార్గమది । దోపకయుండెను సౌఖ్యమందఁగా నెనయఁగుత్రోవ లేని బ్రదు । కెందుకు జావక కన్నతల్లిరో?

అమ్మా! నన్ను మన్నింపుము.

సీ. కన్నపుత్రికకోర్కె । మన్నింపలేదని
చెలఁగి నీభర్త పై । నలుగకమ్మ!
యెఱుఁగకేతప్పైన । నేజేసియున్నచో
యించుక ప్రేమతో । మింపుమమ్మ!
శశిరేఖ యనుపుత్రి । యసలె జన్మింపలే
దని నీమనంబున । దలఁపుమమ్మ!
నాసఖీజనములు । నాసమానులరీతి
మన్నించి వారల । మనుపుమమ్మ!
బావ యభిమన్యుఁ డెప్పుడైన । వచ్చెనేని
వానిపై బెంగచే జచ్చి । నాఁనటంచుఁ
బలుకబోవక తొల్లింటి । వలెనె నిండు
ప్రేముడినిఁగాచుచును వాని । నోముమమ్మ.

రేవ—అమ్మా! ఇట్టివిపరీతపు మాట లాడుచుంటివేమమ్మా!

9. వ. అనుబంధము.

తల్లీ! ఇది నీకుఁదగునా? అమ్మా! అంతయు భగవదాధీనమని యెఱుం గవా! నీవు చావుగోరుకొనఁగనే నీకుఁ జావువచ్చునా? అట్లే వచ్చుట తటస్థించునేని నీవు గోరుకొనిన యభిమన్యుఁడు నీకు దక్కకపోవలయును. ఇది యొకపిచ్చి.

మా-శ—అమ్మా! చావు నాకేలకలుగదో [illegible] పితురాజ్ఞకు వ్యతిరిక్తముగా నడచుట కిష్టములేక [illegible] వెంట నడ[illegible] కం

గీకరింప లేదుగాని- లేకున్న నాభావ నాకు దక్కకుండునా?
ఇప్పు డట్టి యాటంకము లేదుగదా?

చ. అనలము నన్నుఁజూడగనె । యారునో? ఖడ్గము మొద్దుపోవునో
వననిధు లింకునో? విషము । పాయునొ దానిగుణంబు? రత్నమే
కనఁబడకుండునో? పలుపు । కంఠము వేగ బిగింపఁజాలదో
కనుఁగొను దాన నామరణ । కాంక్ష యికేటికి దీరకుండునో?

ఇన్నియు నాకు దూరమైపోయిన పోవుగాక---

తే. వలచి వరియించుకొన్నవా । రల వివాహ
మకట ! నిలువుగీతలవలె । నతుకబోని
యవసరంబున బొడము । దుఃఖానలంబె
నన్ను భ్రమందింపఁజాలదే । కన్నతల్లి !

[అప్పుడు బలరాముఁడు ప్రవేశించును]

బల——మూర్ఖురాలా! ఏమంటివి? నీకుఁ బొడమిన దుఃఖాగ్ని యే నిన్నుఁ బరిమార్చుటకుఁ జాలునా? నోరు వాయఁగొట్టవలయునా? వివాహవేదిక చెంత కరుదెంతువా?

మా-శ——తండ్రీ! ఇంకనైన రక్షింపుము.

10. వ. అనుబంధము.

ఉ. కష్టసుఖంబులెంచి తమ । కాళ్ళపయిన్ బడి యేడ్చి యేడ్చి నా
కిష్టములేదు కౌరవని । కృష్ణపుబాంధవ మంచు నెంతయో
స్పష్టముగా వచించినను । బాములు బెట్టదలంతువేల? నా
కిష్టములేని పెండ్లి గొమన । రించిన నీకగులాభ మేమొకో ?

బల — ఓసీ దౌర్భాగ్యురాలా! నీవు నాయిష్టప్రకారము నడువవలయునా? నేను నీయిష్టప్రకారము నడువవలయునా ? నీసంగతి యేమియో గనుంగొందును లెమ్ము. ప్రియా! యీయువిధే

యురాలను వివాహవేదికకడకు దోడ్కొనిరమ్ము. శీఘ్రమే రమ్ము.

(అని నిష్క్రమించును.)

ద్వి తీ య రం గ ము.

స్థలము:—వివాహమందిరము.

[భీష్మ, ద్రోణ, కృపాశ్వత్థామ లొకప్రక్కను, కర్ణదుర్యోధను లొకప్రక్కను గూర్చుండఁగాఁ దెఱతీచును]

అశ్వ—అంగరాజా! నీవాక్యార్థ మేమియో నాకు స్ఫురింపలేదు. మఱల వచింపుము.

కర్ణ—గురుపుత్రా! బ్రాహ్మణునకుఁ బప్పునం దాశయుండునటగా దా? నీకుఁ బిండివంటలపై దృష్టినుండుటచే నామాట నర్థము జేసుకొంటివిగాదు. నేనేమియు నర్మగర్భముగా వచింపలేదు.

తే. గీ. పట్టి నొసఁగుటచే శౌరి । పాణి మనకుఁ
దోడుఁబడు, కృష్ణుఁడును నన్న । తోటి బాటె
పాండవులవీడి మనచెట్టఁ । బట్టు విధిగ
నపుఁడు కౌంతేయులను । గెల్చు టనఁగనెంత?

ద్రోణు—అంగరాజా! నీవనుకొనిన ట్లెన్నటికిని జరుగదు. కృష్ణుఁడు పాండవుల నెన్నటికిని వీడడు. దానికొక కారణంబున్నది. అది యేమందువా ?

తే. గీ. బదరికాశ్రమమందుఁ ద । పంబొనర్చు
నరుఁడు నారాయణుఁడను । వర మునీంద్రు
లిట్లు కృష్ణార్జును లయి జ । న్మించినారు
వారి సఖ్యంబుజెఱుప నె । వ్వారివశము.

దుర్యో—గురువరా! కృష్ణుఁ డెట్టియవతారపురుషుఁడో, బలరాముఁ

డును నట్టి యవతార పురుషుఁడే గదా ? మీరనినట్లు కృష్ణుఁడు వారియుండనుండుననుకొొండు. అంగరాజనినట్లు తాలాంకుఁడు మనపక్ష మూనును. ఇరువురును నవతారపూరుషులే యైనప్పు డొకరినొకరు నిగ్రహింపలేరుగదా ? ఇఁక ధర్మమెచ్చటనుండునందురా ? పితృపమో జ్యేష్ఠః, అను శాస్త్రప్రకారము బలరాముఁడు కృష్ణునకు వందనీయుఁడుగదా ? అట్టివాని యభీష్టమునకు వ్యతిరిక్తముగా నడచుట కృష్ణునకు దగదుగదా ? తప్పుదోవఁ ద్రొక్కిన నీనికి జయ మెట్లబ్బును. ఎట్లయిన నే నదృష్టవంతుఁడను. ఏమందురా ?

తే. గీ. అన్యజనదుర్లభంబయి । యలరునట్టి
బలునిసాహాయ్య మీరీతి । గలిగియుంటఁ
బాండవుల గెల్చి రాజ్యంబు । బడయవచ్చు
కృష్ణుగర్వము మొదలంటఁ । ద్రుంపవచ్చు.

భీష్మ—వత్సా ! గగనహర్మ్యమునకు సోపానములు గట్టుటలో నీయంతటివాఁడు లేడు.

ఆ. వె. తనయ నిత్తుననుచు । తాలాంకుఁ డనియెను
యిష్టపడకయుండె । కృష్ణుఁ డిందు
నెవరికోర్కె యెట్లు । లీడేరునోయని
తలఁపబోక నిట్లు । తలఁతువేమి ?

కర్ణ—తాతగారూ ! మీరును, యీద్రోణకృపాశ్వత్థామలునుగూడ పాండవపక్ష మూనియుండిరి. మీయట్టివా రిట్లుంట మీయశస్సునకు భంగము. ఇంకను నీపెండ్లి గారాదనియే మీ రాశీర్వదించుచుంటిరా ? దుర్బుద్ధిగో మీరనిన యీవాక్య మెట్లు ఫలించునో చూతును ?

తే. గీ. అదిగో! మంగళస్నానంబు । లగుచునుండె
శుభముహూర్తంబు దాపయి । చూచుచుండె
యెట్టిలోపంబు గలుగఁగలే । దింతవఱకు
నీచిటికెకాలమున జిక్కు । లెట్లుగాదవు ?

దుర్యోధనుని సంపద్విశేషమును జూడజాలక కడుపు మంటచే ననిన మాటను బాటించుటకే దుర్యోధను డంత తెలివిమాలినవాఁడుగాఁడు.

అశ్వ—కర్ణా! కురుకులవంశమును గూకటివేళ్ళతోఁ గూల్ప సంసిద్ధుండవై నీ పితనియుండనుంటె దుర్యోధనుఁ డేల తెలివితక్కువవాఁడగును.

కర్ణు—బ్రాహ్మణప్రభువా! కురుకులవంశవృక్షమును కూకటివేళ్ళతో నేను బెకల్పకుండ నీవు రక్షింపఁదలంచితివా? ఓ తెలివిహీనా?

ఆ. వె. ఆఁడుదానిచేతి । యర్థంబురీతిగాఁ
బృథ్విఁ బురుషుచేతి । బిడ్డయట్లు
విప్రుచేతినున్న । విల్లమ్ములగునంచు
తలఁప కిట్లు ప్రేలఁ । దగునె నీకు.

అశ్వ—ఆఁ- సూతకులాపసదా! ఏమంటివి? విప్రునిచేతినున్న విల్లమ్ములు వ్యర్థములగునా? వ్యర్థములగునో సార్థకములగునో జూతుము. (అం మీఁది కురుకు మన్నాఁడు.)

దుర్యో—(అడ్డుకొని) గురుపుత్రా! ఇదేటిన్యాయము. నమస్కరింతును. దయదలంచి యూరకొనుము.

కర్ణు—సార్వభౌమా! బ్రాహ్మణునకు నమస్కరించి నాకుఁ దలవంపు ఘటింతువా?

11. వ. అనుబంధము.

అశ్వ—దుర్యోధనా! ఆసూతకులాపసదు నొక్కమాఱు విడువుము.

12. వ. అనుబంధము.

దుర్యో—అయ్యలారా! ఇంచుక శాంతింపుడు. అదిగో బలరాముం డరుదెంచుచున్నాఁడు. ఆతఁ డిదిచూచె నేని నిష్కారణము భంగ మొదవును. ఈత్రుటికాల మోరిమి వహింపుఁడు.

[అందఱును శాంతింతురు. అప్పుడు బలరాముఁడు ప్రవేశించును.]

బల—ఆర్యులారా! వందనము.

(అందఱునుఁ బ్రతివందనము లొనర్తురు.)

దుర్యో—(బలరాము నీక్షించి)

తే. గీ. ఘనగదావిద్య నద్వితీ । యునిగఁ జేసి
శీలుతనుండియు సత్ప్రేమ । కలిగియుండి
మనల యనురాగమొల్లఁ బెం । పొనరఁ జేయఁ
దలచి సుతనిచ్చినాకు కో । డలిగఁ జేసి
యాదరించిన నీకభి । వాదమయ్య.

బల—సార్వభౌమా!

క. ఘనుఁడవు శిష్యులయందున
ఘనుఁడవు పృథ్వీశులందు । ఘనుఁడవు విద్యన్
ఘనుఁడవు గుణములయందున
ననఘా! నీతోడ వియ్య । మంద సుకరమే.

నాయందున్న గురుభక్తిచే నీవంగీకరించి నన్ను ధన్యుఁ జేసితివి. ఈ భీష్మద్రోణాదులుగూడ నాయం దధికవాత్సల్యముండి యీ వైవాహికంబునకుఁ జనుదెంచి నన్నమితముగా గౌరవించిరి.

భీష్మ—తాలాంకా! నీయభిమానమునకు మే మెంతయు కృతజ్ఞులము.

ఇందుశర్మ—(ప్రవేశించి) అయ్యా! ముహూర్తము దాపగుచున్నది. వివాహవేదికకడకు దయచేయుఁడు.

(అందఱు నిష్క్రమింతురు.)

తృతీయ రంగము.

—:స్థలము: వివాహవేదిక:—.

[భీష్మ ద్రోణ కృపాశ్వత్థామ కర్ణ దుర్యోధన, బలరాము, కృష్ణు లొకదెసను, రేవతీ మొదలగు స్త్రీజన మొకదెసను, పెండ్లి కుమార్తెయుఁ బెండ్లికుమారుఁడును బీటలపైనుండ వారిమధ్య తెఱ యడ్డుండఁగా, దెఱ లేచును.]

ఇందు—అయ్యా! ముహూర్తము సమీపించినది. తెఱదీయుటకు సెలవా?

ద్రోణు—వేగ కానిండు.

ఇందు—మేళము చెయ్యండిగా. (అని కేకవైచును. మంగళధ్వనులు మ్రోగును.)

ఇందు—ఆయం ముహూర్తస్సుముహూర్తోస్తు. (లక్ష్మణునితో) లక్ష్మణకుమారా! ఇదిగో! ఈ తెఱక్రిందనుండి నీ మనోహరివదన మండల మొక్కసారి జూడుము. (అని తుమ్ముచున్నాఁడు.)

లక్ష్మ—(కొంచెమువంగి చూచి తనలో) ఏమిది? కొండెము బైకెత్తుకొని పాఱిపోవుచున్న వృశ్చికమును జూపించి నా మనోహరియందు రేమిపాపము!

ఇందు—అయ్యా! ఆవదనము బాగుగా జూచితిరా?

లక్ష్మ—ఏమయ్యా! వృశ్చికమును జూపి పెండ్లికొమరితయందు రేమి పాపము! ఆపీటపైనున్న తేలునుజంపి పెండ్లికుమార్తెను గూర్చుండఁబెట్టుఁడు.

ఇంను — తేల నెద రేమయ్యా ! మది కుదుటబరచుకొని చూడుఁడు.

లక్ష్మి —(చూడఁబోయి) అయ్యా ! మీకొక్క నమస్కారము. నే నావైపునకుఁ జూడఁజాల. నన్ను క్షమించుఁడు.

కరు - కుమారా !

సీ. ముద్దుమొగంబుపై । ముసిముసినగవులు
కాంతి లేవెన్నెలై । గ్రాలుచుండ
కాటుకద్యుతులొప్పు । కనుఁగవయందంబు
తళతళ మెఱయుచున్ । దనరుచుండ
కస్తూరితిలకంబు । కాంతి నల్దిశలందు
వెదజల్లి మదికెంతొ । ముదముగూర్ప
నీలంపుముంగురుల్ । ఫాలంబుపైఁబడి
గొనబైనయందంబు । గూర్చుచుండ
వజ్రమణిమయభూషణా । వనులమధ్య
నలరువదనంబు నక్షత్ర । ములకు మధ్య
నుండు చంద్రబింబంబటు । లొప్పుచుండ
నరయుజాలక వృశ్చిక । మందువేమి ?

లక్ష్మి—అయ్యా ! మీరు సరిగాఁ దేటబాటి జూడుఁడు.

తే. గీ. కనులు మిఱుమిట్లుగొల్పెడి । కాంతిగాదు
బాలరుచిలీనువదనబిం । బంబుగాదు
మరునిరాజిల్కయనదగు । మగువకాదు
విధిగ నమ్ముడు నిజ మిది । వృశ్చికంబు.

దుర్గ—నాయనా ! మదికుదుట బరచుకొని యీమారు జూడుము.

లక్ష్మి — (వణకుచు తెఱవైపుఁజూచి)

మాత్తకోకిల. పిండిబొక్కెడి గంకుపిల్లిని । బెండ్లిచేతురె నాకిటన్
నిండుప్రేముడి బెంచినాయెడ । నిర్దయన్ వహియించి, భూ

మండలిన్ బ్రదుకంగనీయక । మ్రింద్రఁ జేయుఁగ గాంచి రే
పెండిలే వలదింక బోయెద । వీడుడయ్య నమస్కృతుల్.

దుర్యో — (తనలో) ఇదేదియో నద్భుతముగా నున్నది. ఇంతవఱకు వృశ్చికమనిన వాఁడిప్పుడు గండుబిల్లి యనుచున్నాఁడు. ఏని కీచిత్తవిభ్రమణ మేలగలిగినది చెప్పుమా ?

అశ్వ — కుమారా ! ఎన్నఁడును లేని మాటలాడుచుంటి వేమిపాపము. నవవయోవిలాసినియై నెగడుచున్న నీచెలియుం గాంచి గండుబిల్లియని, వృశ్చికమని యందువేమి ? మది కుదుటబరచుకొని యాజగన్మోహనాకారిణి నొకసారి వీక్షించుము.

లక్ష్మ — (మఱలఁ జూచి)

క. మీ కేమి విషయము బెట్టితి
నాకీమర్కటముఁ జూపి । నాతియటంచున్
వాకొని కడుమోసంబున
నాకిపు డిట్లొంటఁగట్ట । న్యాయమటయ్యా !

క. బలుఁడును నీవును నొకటై
బలవంతముగాఁగ నాదు । ప్రాణము దీయన్
దలచితె తండ్రీ ! నాయెడ
గల ప్రేమన్ వీడ నేమి । కారణమయ్యా !

(అని తండ్రి కాళ్ళపై బడును.)

దుర్యో — నాయనా ! నీ కిట్టివెఱ్ఱి యెట్లు దటస్థించినది. నావంశోద్ధారకుండవగు నీపై నేనలుగుదునా ? తండ్రీ ! పరులు విన్న నగుబాటగును. మది కుదుటబరచుకొని నీయర్ధాంగిని జూడుము. (అని తీసికొనివెడలి తాను స్వయముఁగా దెఱనెత్తి చూపుచున్నాఁడు.)

లక్ష్మ — (చూచి) అమ్మయ్యో !

క. తెలియక వచ్చితి మామా
రలవెంట న్నిటకు నాదు । ప్రాణము నిల్పన్
బలి! నిన్నెంతయు వేడెద
నలుకవిడచి నన్నుబ్రోవు । మమ్మా దయతో!

(అని పులియనుకొని పాదములపైఁ బడుచున్నాఁడు.)

బల—(తనలో) అక్కటా! ఈతఁడు పిచ్చివాఁడుగాఁబోలును. తెలి యక మోసపోయి రారాజకుమారుఁడుగదా యని సంతసించి బంధువులతో విరోధము వచ్చినను సరియేయని యీ బాంధ వ్యమున కంగీకరించి యిట్లు నలువురిలోనను దలవంపులు దెచ్చుకొంటిని. ఎంతమోసము వచ్చెను.

ద్రోణు—లక్ష్మణా!

క. శృంగారరసము జిల్కెడి
యంగన నీ చెంతనుండ । నడలుచు పులియం
చుం గంతులువైచుచు, మొ్రి
క్కంగను బాడియగునె యిటు । కలతంబడుచున్.

కర్ణు—(క్రోధముతో) ఓ భీష్మద్రోణులారా!

తే. గీ. పెండ్లిగాదని మీరెల్ల । బెట్టినట్టి
శాప మీరీతి దగిలె నీ । శాబకునకు
కాకయుండిన సద్గుణ । గణయుతుండు
లక్ష్మణుని కిట్టిపిచ్చి యే । లాగుగలిగె?

అశ్వ—ఓ యభాగ్యశిరోమణీ! కర్ణా!

తే. గీ. ధరమహాపతివ్రత యయి । దనరుశశియె
పరుసముట్టంగ నిష్టంబు । బడక మదినిఁ
బెక్కురూపుల నిటు భయ । పెట్టుచుండె
గాని శాపకారణ మిది । గాదు కర్ణ.

బ్రాహ్మణులు — (అడావిడిగా లేచి గంతులువైచుచు) అయ్యయ్యో! ఈ విషోరగంబులన్నియు నెక్కడనుండివచ్చినవి.

పేరటాండ్రు — ఓ పరమేశ్వరా! ఇదియేమిమాయ! ఈభల్లుకములన్నియు నెటనుండివచ్చినవి. అయ్యో! స్త్రీజనంబెల్ల భల్లూకవాతబడకుండ మీరెల్ల రరుదెంచి మమ్ము రక్షింపుఁడు.

రేవ — నాథా! నాథా! రక్షింపుము. రక్షింపుఁడు. పులి విచ్చలవిడిగా నంతిపురంబునఁ జొరబడినది. (అని పాదములపైఁబడును.)

బల — కటకటా! ఎట్టియనర్థముత్పన్నమైనది?

లక్ష్మ — ఓ తాతగారూ! గురువుగారూ!! గురుపుత్రా! మీరైన నీయభాగ్యలక్ష్మణుని గాపాడరా?

సీ. అదె భయంకరమైన । వదనగహ్వరమందుఁ
బదనుదంష్ట్రంబుల । పటిమజూపి
భీకరాకారియై । వేవేగ నామీఁద
బడుచుండె దయను గా । పాడరయ్య
యెటుఁబోవుటకుఁగూడ । నేమాత్రమును మార్గ
మీయక వెతబెట్ట । నెంచుచుండె
వలదు నాకీపెండ్లి । బలుసాకు దినినైన
బ్రతికెద గాపాడ । రండు వేగ
కన్నవారికి దయలేక । యున్నదయ్య
పెద్దలా మిమ్ము మిక్కిలి । వేడుచుంటి
హలధరుండును మావారు । లరయ నొకటి
మీరె దిక్కయ్య! రక్షింప । రారటయ్య

లలిత — (ప్రవేశించి బలరామునితో) అయ్యో! మనమువర్తకులదగ్గఱ బుచ్చుకొనినవస్త్రంబు లెగిరిపోయినవి. సుగంధద్రవ్యములు యు దుర్వాసన వేయుచున్నవి. అంతయు మాయఁగా,

మా-శ — (లేచి) ప్రాణేశ్వరా!

సీ. మనసార వరియించు । కొనిన యా యభిమన్యు
బాసితి నీ చెట్టఁ । బట్టుకొనకు
ఆబాల్యమైత్రి నే । నవలకుఁ ద్రోసితిఁ
జేరి నీతోఁ జెల్మి । చేయుకొనకు
మన్నించు నాభావ । నెన్నక పీడితి
రాజ్ఞనై నీయండ । బ్రదుకుకొనకు
బ్రతిమాలు నాభావ । పజ్జ నెమ్మదిరోసి
కోరినిల్చితి నిన్ను । గూడుకొనకు
అట్టి నాయాశ లెల్ల ని । రాశ జేసి
కనులు మిఱుమిట్లు గొల్పు నా । కాంతి గాంచి
యురక నీకేల భయపడు । చుంటివేల
పరులు నవ్వంగ నాభావ । పరిహసింప.

(అని లక్ష్మణు నొక్కటిగొట్టి ఘటోత్కచాకారము దాల్చి)

శా. ఓరీ! కౌరవవంశనాశనుఁడ! ఓ । హాలోకర్ణ! దుశ్శాసనా!
నారీరత్నము నేనుగాను వినుఁడీ । న్యాయంబు మిమ్మెల్లరన్
క్రూరత్వంబున జంపివేయుటకు ర । క్షోనాథుఁ డేతెంచెరా
పారంబోకుఁడు పారిపోవ నెవఁ డీ । వంబుల్ ధరణ్ నిల్చునే.

ఓరీ! దుర్యోధనా!

తే. గీ. ఎల్లవిధముల దగినవ మే । నల్లుఁ డూడఁ
బట్టి నిమ్ము మాకని వార్త । బంపినప్పు
డెంత సంతోషబడితివో । యంతకంత
ఘోరదుఃఖాబ్ధిలోఁబడి । కుళ్లుమింక.

కర్ణ — (చరాలున లేచి)

ఘటో—చీఛీ పారుబోతులారా! ఒక్కనితో బోరలేక పందలై పరుగిడ నుంటిరా? మిమ్ముఁ దరిమి తరిమి గొట్టకున్న నేను భీమసేనుని పుత్రుఁడ నేగాను.

[అందఱును నిష్క్రమింతురు. వారివెనుక ఘటోత్కచుఁడు వెడలి రెండవవైపునుండి మఱల బ్రవేశించును]

ఘటో—ఔరా! కౌరవులెల్లరు కాలికి బుద్ధిసెప్పుకొని పలాయన సూత్రపారాయణ మొనర్చి పరీక్షయం దుత్తీర్ణులైనారు. ఇంక వారిని విడచిపెట్టి నూతనవైధవ్యముదాల్చి యిల్లుదూరిన కాంతవోలె నొకమూలనడఁగియున్న బలరాముని యభిమతమేమియో కనుఁగొందుఁగాక.

(అని నిష్క్రమించును)

[బలరామకృష్ణులు బ్రవేశించుచున్నారు]

కృష్ణు—అగ్రజా! నే నిందేమియును నెఱుఁగను. సుభద్రాభిమన్యులే యీఘటోత్కచుని బంపించియుందురు. అతఁడే మనశశిని మాయఁజేసి దోడ్కొనిపోయి వారలచెంత భద్రపరచి యీ విచిత్రనాటకమాడ మఱల నిచ్చటికి విచ్చేసియుండును. అంతియేగాని నిజముగా నే నిందేమియు నెఱుఁగను. ఎఱిగియున్న నీకు జెప్పకుండనుందునా? ఇంతకును వివాహసమయమున నేను లేకపోవుటవలన నీచిక్కు వచ్చినది.

బల—కృష్ణా! ఎఱుగనని యేలబొంకెదవు? నిజముగా నీవెఱుంగని చో గర్ణదుర్యోధనుల జంపఁబోవు ఘటోత్కచు నేల హెచ్చరించితివి?

కృష్ణు—ఏదిచెప్పినను బొంకితినందువు? అట్లుపల్కినదాకాశవాణియో, యాతని యనుచరులో, గాని నేను గాదు. నామాట నమ్ముము.

బల—అనుజా! గతజలసేతుబంధనమేల? పూర్వక్రోధము మనమునం దిడుకొనక మాశశిని యభిమన్యునకే నొసంగెద నాఘటో త్కచుని శాంతింపుమనుము.

కృష్ణు—ఓ భీమనందనా! తానొనర్చిన యకార్యకరణంబునకు నా యగ్రజుం డెంతయు లజ్జించుచున్నాఁడు. శశిరేఖను నీసోదరున కొసంగ బలభద్రుఁడు సమ్మతి వహించెను. ఇంక శాంతించి నాసన్నిధికి రమ్ము.

[ తెఱలో ]

దేవా! దేవకీనందనా! నీయనుగ్రహ మొక్కటున్నవారి కింద్రత్వమైనను లెక్కలేదు. నీయనుగ్రహ మొక్కటున్న మేరువును జిటికెనవ్రేలనెత్తి శతయోజనములు మీటవచ్చును. నేఁడు నీయనుగ్రహము లేకున్న నీకౌరవవ్రాతమును నేను నిర్జింపఁ గలనా? తమరనిన వాక్యములే బలరాముఁడనినచో బాగుండును.

కృష్ణు—అగ్రజా! ఘటోత్కచుని యభిప్రాయము తెలిసినదిగదా?

బల—కృష్ణా! నీవనియుండఁగ మఱల నేనను కెందులకు? కేవల పరమేశ్వరుండవగు నీవాడితప్పుదువనియా యాతని యభిప్రాయము? [ తెరలో ]

ఓయభిమానధనా! బలరామా! శశిరేఖను నభిమన్యున కిమ్మని చెప్పినప్పు డీతఁడు పామరుండని దలంచి యాతని యాన నిరాకరించి తలమునిఁగి తాడిప్రమాణమునకు వచ్చినప్పుడు పరమేశుండని గ్రహించితివా? నీగర్వ మింకను నిన్ను విడువలేదా?

బల—ఓహిడింబాకుమారా! నాయవివేకమునకు మన్నింపుము.

క. కలుములచెలి ప్రియనాథుని
పలుకులు చెవిసోకనీక । పాపాత్ముఁడనై

సలిపిన దుష్కార్యమునకు
ఫలమీయ సమకూడె సర్వ । భంజన మయ్యెన్.

క. జెలంగి కుమీా శశిరేఖను
బలభిత్సుతసుతున కిచ్చి । ప్రార్థించెద నా
పలుకుల కలుగికు మాపెన్
కలహాంతక రమ్ము పలుల । కవిరోధసుతా!

ఘటో—(ప్రవేశించి) నందనందనా! వందనము. పెద్దమామా! నమస్కారము!

శా. నాతల్లిన్ మఱి నాకుటుంబములను నా । నాకేతులన్ దిట్టుచున్
నాతమ్మున్ బడగొట్టనెంచితినుచున్ । నాతల్లియున్ బాతురైదున్
నాకోఁ జెప్పఁగనీవు గర్వమునఁ జక్ । నాతమ్ముకున్ నీశశిన్
జేకోమోదముతోడ కూర్చుటకు । నిశ్చింతాత్మతో వచ్చి యీ
రీతిన్ జేసి ప్రతిజ్ఞ గెల్చితిని నే । రింపన్ దగున్ నల్లునిన్.

కృష్ణు—ఘటోత్కచా! ధర్మబుద్ధివై వచ్చిన నీకుధర్మమే చేకూరినది.

ఘటో—అయ్యా! మాటల కవకాశము లేదు. ఈ నల్లవారుఝామున నే నాయాశ్రమంబున శశిరేఖాభిమన్యుల వివాహము జరుప నిశ్చయింపఁబడినది. మీారెల్ల వేగమే రావలయును. పెద్దమామా! నీవు స్వయముగా కన్యధార పోయవలయును. ఇష్టమేనా?

బల—నాయనా! నాకంతకంటె కావలసిన దేమున్నది.

కృష్ణు—ఘటోత్కచా! ఇంకాలస్యమెందులకు? అవరోధజనంబును దోడ్కొని వేగపోయిరమ్ము.

(అందరును నిష్క్రమింతురు)

ఇది తురీయాంకము.





శ్రీ

# సంగీతశశిరేఖ.

## పంచమాంకము.

### ప్రథమరంగము.

—స్థలము—ఘటోత్కచాశ్రమము—

[సుభద్రయు, హిడింబియు, శశిరేఖయు, నభిమన్యుడును గూర్చుండి యుండఁగాఁ దెఱలేచును.]

13. వ. అనుబంధము.

సుభ— అక్కా! చిరంజీవి యింతదనుక రాకుండుటచే నామనము డోలాయమానమై యున్నది. మనకు గావలసినవస్తు వేదియో మనకు రానేవచ్చినది. నీకింకాదుష్టాత్ములతో నేమిపనియని నేనన వినిపించుకొనక వెడలెను. అదియంతయు శత్రువర్గము. నూఱు కాకులలో నొకకోవెల యనునట్లింతమంది శత్రువర్గములో నీతఁడొక్కఁడేమి చేయును? ఆ తులువ లందఱేకమై మనవానినేమిచేయుచున్నారో యని నాకు మిక్కిలి భయంబగుచున్నది.

అభి జననీ! నీవనినది నిక్కువము.

చ. వినుమిటు తల్లిరో! యటకు । వేగమె నేనును బోయి యగ్రజు
గనుఁగొని, యన్నతోఁగలసి । కౌరవయోధుల బాఱద్రోలి మ

మ్మనయము గేలిజేయుము సీరాయుధు గర్వముదు ్రితు బంపుమీ
యనలము వాయువున్ గలసినట్టుల యాజుమి మేము గూడుచోన్.

హిడిం — సోదరీ! చిరంజీవి బలపరాక్రమమును గూర్చి సంశయించు చుంటివా? ఇట్టి కౌరవాధము లొక లక్షమంది యేకమైవచ్చి నను మనవాని కేమియు భయములేదు. బలంబునకుఁ దోడు పరులకభేద్యంబగు రాక్షసమాయగూడ నున్నది. అట్టినానిని నిగ్రహించుటకు మదోన్మత్తులగు కౌరవాధములకుఁ దరమగునా?

శశి — కనుకట్టుకట్టుటలో మాబావగారు గారడీవానికంటె ఘటికులు. ఎంతవారును గాకున్న సహస్రసఖీజన పరివృతంబై యున్న యంతఃపురంబులోఁ జొరబడి రెండవకంటివారెఱుంగకుండ నన్నుఁ దోడ్కొని రాగలరా? మాబావగారు 'గజదొంగ' యనుబిరుదుంబున కెంతయుఁ దగియున్నారు.

సుభ — శశీ! ఎదుటలేని మేనబావను పరిహసించుచుంటివా? అతఁడున్నచో సమాధానమిచ్చును.

అభి — దబ్బరలాఁడు వెఱ్ఱిగొల్లలను మాయఁజేయుట కెంతయో ప్రజ్ఞ యవసరములేదు. శశీ! కుక్కకాటునకుఁ జెప్పుదెబ్బయనినటుల మీ తండ్రిమొండితనమునకు మాయన్నగారు చెప్పినబుద్ధి యెంతయో సమంజసముగ నున్నది.

శశి — బావా! ఇంకా మాటతలపెట్టి నన్ను వ్యాకులపరుపకుడు. నాజనకుని కఠినత్వము తలంచకొలఁది నాహృదయము వ్రయ్యలగుచుండును.

అభి — అట్లయిన నే నామాటయే తలపెట్టను.

[అప్పుడు ఘటోత్కచుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ఘటో—(తనలో) దేవా! దేవకీనందనా! నీయనుగ్రహమున వారి కెట్టి కష్టంబును రాదు.

14. వ. అనుబాధము.

వివాహముహూర్తమున కింకను సమయమున్నది ఈలోపునఁ జేయవలసిన పనులింకేమియు లేవు. శ్రీకృష్ణబలరాములును, వారి వారి స్త్రీజనంబును తక్కుంగల బంధువులును వివాహమునకై వచ్చుచున్నారుగదా? రేవతీబలరాము లిరువురును గన్యాప్రదాన మొనర్చునటు లొనరించితినిగదా? (ముందునకుఁజూచి) అదిగో! మావాండ్రెల్ల నారాకకై నిరీక్షించుచున్నట్లున్నారు. నేనరిగి యచ్చటివేడుకలెల్ల వారి కెఱింగించి వారి నానందాబ్ధి నోలలాడించెదఁగాక. (అని సమీపించి) తల్లులారా! నమస్కారము.

సుభ—చిరంజీవివై వర్ధిల్లుము. కుమారా! క్షేమముగావచ్చితివా? నీ వొక్కరుండ వాకౌరవాధములచే నెట్టిపాట్లకు లోనైతివో యని చాలవిచారించితిని. నీతమ్ముని నీకు సహాయముగాఁ బొమ్మని యిప్పుడే యనుచుంటిని. ఇంతలోననే నీవు విచ్చేసి నా కానందముగూర్చితివి. తనయా! అచ్చటి విశేషము లేమి?

ఘటో—జననీ! అచ్చట నడచిన విశేషము లుగ్గడించుటకు నాకు సమర్థత చాలదు. అయినను జెప్పెద నాలింపుము. నాయనుచరుల నందఱ వర్తకులగా నొనరించి వారిచెంతనున్న నిజమగు వస్తువాహనంబులును, వస్త్రంబులును, సుగంధద్రవ్యములును మేము బడసి మాచెంతనున్న మాయావస్తువులన్నియు వారల కంటఁగట్టించితిని. ఆవెనుక నేను మ్రా మఱదలి రూపమును ధరించి యంతఃపురంబులోఁ బ్రవేశించి, దాసదాసీజనంబును,

రేవతియు నెల్లరునుగూడ నిజముగు శశిరేఖయే యని యను కొనునటు లభిమన్యునిపై విరాళి నటించుచు, వానికొఱకై బిగ్గఱగా నేడ్చుచు నెంతనాటకమైన నాడితిని. అది చూచితీర వలయునేగాని చెప్పఁగలనా? నా నటన మంతయుఁ జూచి నన్నెవ్వ రనుమానించుట కవకాశము లేకపోయినది. పెండ్లి నాఁ డెల్ల వివాహమంటపమునకు వచ్చిరి. క్రమక్రమముగా మంగళస్నానములైనవి.

సుభ — ఔరా! ఎంతమోస మొనరించితివి?

అభి — అగ్రజా! నా కొఱకెంత శ్రమబడితివి.

శశి — పెద్దబావగా రవరోధజనములో నుండఁగాఁ జూచుప్రాప్తము నాకు లేనందుల కెంతయో చింతించుచున్నాను.

ఘటో — బావగా రవరోధజనములో నుండగా జూచుప్రాప్తి లేకున్న ను, మూఁకవనితవోలె ధనయుతుండగు జామాతగావలయునని వనితకంటె కనిష్టముగా సంచరించిన నీజనకుని స్త్రీ పాత్రాభి నయనముఁ గాంచి సంతసించితివిగదా? పురుషరూపధారునై స్త్రీపాత్ర మభినయించిన నీజనకునికంటె ఘనుఁడ ననుకొం టివా?

హిడిం — కోడలా! అని యనుపించుకొను టత్తగారూ! మీకు స్వ భావ మనున ట్లున్నది. ఒక టన నేల? రెండు బడ నేల?

శశి — అత్తా!

తే. గీ. ధరను బరిహాసమాడఁగాఁ । దలఁచువారు
తిరిగి హాసియింపఁబడుటకు । వెఱువరమ్మ!
వర్ష సౌఖ్యంబు నెదగోరు । వార లెపుడుఁ
బిడుగు బడునేమొయని మది । వెఱువనటుల!

అనినవా రనిపించుకొనుట కెప్పుడును సిద్ధమైయుందురు.

**సుభ**—కుమారా! ఆమెవాక్యంబులను బాటింపక తరువాత నేమి జరిగినదో నాకెఱింగింపుము. జరిగినవిశేషంబు లెఱుంగుటకు నామనం బుత్సహించుచున్నది.

**ఘటో**—నేను నిజముగ శశిరేఖనే యనుకొని నన్నును లక్ష్మణుని బీటలపై గూర్చుండఁబెట్టిరి. లగ్నసమయమునఁ గొంచెము తెలియెత్తి నావదనబింబమును జూడుమని పెండ్లికుమారుని హెచ్చరించిరి. ఆసమయమున—

సీ. ఘనవృశ్చికంబునై । గాన్పించి యంతలో
భల్లూకమును నయి । భయముఁబెట్టి
పిండిబొక్కుచునున్న । పిల్లినై యంతలో
గుండేలునై గల । గుండుబరచి
జలజలఁ బ్రాకెడి । సర్పంబునై యిట్టె
పెద్దపులిగ మారి । భీతిఁగొల్పి
భీకరాకారియౌ । రాకాసినై యిట్టె
సింహంబునై వాని । జిక్కబెట్టి
ఘడియ కొకరూపమును నడి । వడిగదాల్చి
నాటిమొత్తింటి కురుపతి । వెలుగుఁబడఁగ
బలుఁడు తలవ్రాల్చఁ కురుయోధు । లడల పెండ్లి
కొడుకు నాడించితిని సభ । గొల్లుమనఁగ.

నాయనుచరు లెల్లరును వృశ్చికంబులరీతి, సర్పంబులభాతినై స్త్రీజనంబును గగ్గోలుబరచిరి. వివాహవేదిక రణభూమియైనది. మీరుపెట్టిన శాపఫల మిది యని కర్ణుఁడు భీష్మద్రోణాదులపై లేచెను. మహాపతివ్రతయనదగు శశిరేఖ యభిమన్యునిఁగాక తక్కంగలవారినేరిని ముట్టుట కిష్టములేక నిక్కంపు నతియగు

టచే లక్ష్మణున కిట్టుగాన్పించి భయపెట్టుచున్నదే గాని కురు వీరుల శాపకారణముగాదని యశ్వత్థామ లేచెను. బలరామా దులెల్ల బెల్లము మొత్తిన ఱాయివోలె నూరక మిడుతుమిడు తుమని జూచుచుండిరి. ఇట్లుండ నాకస్మికముగా నేను నా యథారూపమునుదాల్చి లక్ష్మణుని వెన్నుపై నొక్కటిచరచి కర్ణదుర్యోధనులపైఁబడితిని. వారెల్ల రడలి బెజారైపటాపంచ లై పాఱిపోయిరి. వారినెల్ల తరిమితరిమి గొట్టితిని. వారు వెనుది రిగిజూడక పాఱిపోయిరి. తరువాత నేనొనర్చిన యట్టహాసము నకు వెఱచి కృష్ణునిబోధనమున శశిరేఖ నభిమన్యున కిచ్చి వివా హ మొనర్చుటకు మాపెద్దమామ యంగీకరించెను. వారెల్ల రిచ్చటకే వచ్చి ముహూర్తము మించిపోకుండ వివాహంబొన రింతురు. మామఱదలి పట్టుదలచేతను, దైవసహాయముచేతను నీకార్యమిప్పటికి జయము సమకూరినది.

శశి—— 15. వ. అనుబాధము

అభి — సోదరా! ఈ మాసర్వసౌఖ్యంబులకును నీవే కారణము.

చ. మఱదలిప్రతిజ్ఞ సోదరు న । మానుష శక్తియు నింపులోఁగను
మ్మరయఁగ మాప్రయత్నముల । యందున లాభములేకపోయె, నీ
కరుణయు గార్యదీక్షయును । గారణమై విలసిల్లుచుండె మే
మిరువుర సర్వసౌఖ్యముల । నీగతి దేలి సుఖింపనగ్రజా !

సుభ——ఆమాట నిజము. నీకార్యదీక్షయుఁ, దైవసహాయ మేకమై మాకు ఫలంబొనగూర్చినది.

హిడిం——సోదరీ ! సుతుని స్తుతింపవచ్చునా ?

సుభ——అక్కా ! సత్యమువచించితినిగాని నేనేమియు స్తుతింపలేదు. అదిగాక పదిపన్నెండు దినములనుండి యెట్టియానందంబును లేక దరిలేని విచారాంభోధిలోఁ బడియుంటిని. నావిచారా

వస్థనంతయు నెఱింగి నాయగ్రిమసుతుండు నావిచారమును బోఁగొట్టి మాతృఋణము నుండి విముక్తుండయ్యెను. నేటికి నాయానందము నాకు మరలవచ్చినది.

ఘటో—అమ్మలారా ! మనమిట్లు వేడుకల వెల్లిలో మునింగి ప్రస్తుత కార్యమును మఱచుచుంటిమి. వివాహముహూర్తము దాపైనది. మామామలు సకుటుంబముగా వచ్చుచుందురు. వివాహమంటపమునకుఁ బోవుదము రండు.

(అందఱు నిష్క్రమింతురు)

ద్వితీయరంగము.

—:స్థలము—వివాహమంటపము.—

[సుభద్రాభిమన్యులును, శశిరేఖయు, ఘటోత్కచుఁడు, హిడింబియు, బలరాముఁడు, శ్రీకృష్ణుఁడు, రేవతి, దేవకీదేవి, కనకలత, రూపలత మొదలగువారెల్ల గూర్చుండియుండఁగాఁ దెఱ లేచును.]

బల—చెల్లెలా ! నీ వనినట్లు బరమేశ్వర విలాసమట్లున్నది గావున నే నాకట్టి చెడుభావ ముదయించినది. అయినను దోషము నాదియే యని వేడుచున్నాను. నిన్నుఁ జూచుటకు మిగుల లజ్జించుచున్నాను. నాదోషములన్నియు క్షమించి నన్నాదరింపుము.

క. ఎల్లవిధంబుల దగు మే
నల్లునివిడనాడి మిగుల । నల్లరిపాలై
తెలగు శోకాబ్ధినిబడి
దల్లడబడుచున్న నన్ను । దయగను మమ్మా !

సుభ—అగ్రజా ! పెద్దవాఁడవైయుండి నన్నిట్లు వేడ దగునా ? గతించిన విషయంబు లెల్ల మఱచిపొమ్ము. నీవు నన్ననరాని మాటలనినప్పుడు నేనుమాత్రము నిన్ను ముద్దుపెట్టుకొంటినా ?

అదియంతయు వేళావిశేషము. ఆసంగతులు మన మిరువుర మును మరచిపోవలయును.

బల—అగును. అట్లేమఱచిపోదము.

ఉ. పుట్టిననాటినుండియును । బూర్ణముదంబున నీదుకోడలం
జేట్టుల నెంచినావొ ? యటు । లే శశి నీప్రియకోడలై ముదం
బుట్టిపడంగ నీదరిని । యుండెను దానిని నాదరించి నీ
పట్టికిఁగూర్చి నాహృదయ । భారము దీర్పగదమ్మ చెల్లెలా !

క. తెలియక పలికిన పలుకుల
కులకక నాయెడల క్రోధ । ముంపక, శశిపైఁ
గల తొల్లిఁటి యనురాగముఁ
దొలఁగక నేలుకొనుము దయ । తోడ సుభద్రా !

సుభ—అగ్రజా ! ఎంతమాట. ఆమెను నాయూఅపప్రాణమట్టుల జూచుకొందును.

రేవ—వదినా ! నాకిప్పటి కానంద ముద్భవించినది. నీకోఱిక నెఱవేరి నది. నాతనయ మనోరధ మీడేరినది. దాని నింకమీఁద నెట్లాదరింతువో నీదేభారము.

చ. కనుటయె తల్లివంతు, యధి । కారమొనర్చియొ, నాదరించియో
ఘనతరమైన ప్రేమమును । గల్మషమింతయు లేక జూపుచున్.
మనుచుట యత్తవంతనుచు । మాన్యులటండ్రు మదీయ భార మీ
క్షణమున దీరి నీఘనభు । జంబులపై బడె నేమి చేతువో ?

సుభ—వదినా !

తే. గీ. కనుటయే నీదువంతయ్యె । గాని నాదు
బిడ్డకంటెను బ్రేమ నే । బెంచలేదె
యపుడు గలయట్టి యనురాగ । మిపుడు నాదు
కోడలైనంత బోవునే । కువలయాక్షి!

రేవ—నీయనురాగము బోవుననిగాదు. నా గర్భవాసపుఁ దీపి యట్లు జెప్పించినది.

కృష్ణు—అభిమన్యూ! నీకోరినసతి నీకుఁ జేకూరినది. నీ యాశయము నెఱవేఱినది. నీ వివాహమునకు స్వయముగా నీపితామహుం డగు దేవేంద్రుఁడే వచ్చి నిన్నాదరించి వెడలెను. నీకోరిక లన్నియు సమకూరినవి. నీకింకేమి గావలయును.

అభి—మామా! నీయధికానురాగముకంటె నాకింకేమిగావలయును? అయిన నిట్లగుఁగాక.

చ. గుణయుతులైన కన్యకలు । గోరివరించిన వాని నెంతయో
యనుపమలీలదెచ్చి తమ । యాత్మజకుఁ దలిదండ్రు లిచ్చి పెం
డ్లిని నొనరింతురుగాక, కను । నీచ ధనంబున కాసజెంద కే
మునివరులెల్ల నీదుపద । ముల్ భజియింతురుగాత నెప్పుడున్.

కృష్ణు—శశీ! నీ మనోహరుని యభిలాష వింటివిగదా? నీ కేమిగావలయును.

శశి—దేవా! నాకును నీయనుగ్రహమే గావలయును. అది యెన్నటికిని గొరతకాదని మదభీష్టము నెఱవేర్చి నాకెఱుంగఁ జేసితివి. అందులకు నీకనేకవేలవందనములు. అయిన నిట్లగుగాక.

తే. గీ. నెలకు మున్నూఱు వర్షముల్ । గలుఁగుగాత
యమితసౌఖ్యంబు [illegible] । కలరుఁ గాత

తేడు దయతోడ బ్రజ నాద । రించుగాత
కోరి నిస్వేడ ఫలము చే । కూరుగాత.

కృష్ణు—అట్లే యగుగాక.

## గద్య.

ఇది శ్రీ సత్యవతీకృపాపాత్ర భారద్వాజసగోత్ర పవిత్రాయినాపుర
పు వంశలతాంకూర సత్యమాంబా బాపనామాత్య మిథున
గర్భ శుక్తిముక్తాఫల మృదుమధుర కవితావిశేష్య
లేశ్వర సుబ్రహ్మణ్యశాస్త్రి మలకపల్లిచినశే
షగిరిరాయకవిద్వయ ప్రియశిష్య వి
బుధ సజ్జనవిధేయ సోమేశ్వరరాయ
కవిప్రణీతంబైన శశిరేఖ నాటక
మునందు సర్వమ్మును

పంచమాంకము.

సమాప్తము.



# అనుబంధములు.



## 1. వ. అనుబంధము.

శంకరాభరణరాగము—ఏకతాళము.

ప॥ ఈశ- సర్వేశ- లోకేశా- జగదీశా-

అ॥ ప॥ ఈశ- ఈశ- ఈశ- సుప్రకాశ- భవవినాశ॥ ఈశ॥

చ॥ 1. నీనామంబెద- గొల్చెద
నిన్నేమది- ధ్యానించెద
నాపాపంబిఁక- బోనాడుము
నీప్రాపెద- నమ్మియుంటి॥ నీశ॥

2. సతతంబును- నీనామమె
మతియందున - నుతిసేయుచు
గతినీవని- నమ్మియుంటి
మతిమంతుఁడ దయ- మన్నింపుము నను॥ నీశ॥

## 2. వ. అనుబాధము.

సుభ—

పున్నాగరాగము—ఆదితాళము.

ప॥ వింటివా ! సో-ద-రా ! ॥వింటి॥

అ॥ ప॥ నన్ననరాని మాటలని పరిభవించె పెద్దన్న॥ వింటి॥

చ॥ తనతో సమముగ నేక గర్భమున
జననమందిన సోదరి ననరాని మాట లనె॥ వింటి॥

2. నీసుతునకు నేమిజూచి మాశశిరేఖ
నిమ్మటంచు వందు వనుచు- నిందజేయుజొచ్చె॥ వింటి॥

3. బ్రిదిమాలితి - పదము లంటితి
బ్రితిమాలినకొలది - వదరజొచ్చె॥ వింటి।
4. మంచి మర్యాదలేక - మా యత్తవారినెల్ల వ
చించి నోటికొలందులాడి-ఛీ! ఛీ!! యనజొచ్చెనయ్యో॥ విం॥

---

3. వ. అనుబంధము.

శశి—

కాఫీరాగము — ఏకతాళము.

ప॥ అకటా! జనకా! నీ కిది న్యాయమా! అక॥
అ॥ ప॥ శ్రేయమె?-నా......మనోరథ.
మనుగం...ట...జేయ న్యాయమె? ॥అక॥
చ॥ 1. సకలమెఱింగిన నీవే. నాసౌఖ్యము దలంపక
ప్రకటితమతినిటు - ప్రకటనంజేయ॥ అకటా॥
2. చెలువు డభి...మన్యుని చిత్తమున...మరువ...
గలనె? యేటికి నాకీ- కఠినాజ్ఞనిడితి ॥వకటా జనకా॥
3. మరచి...నా...ప్రియుని - మని— యుండంగలనె?
కరుణా...లే...కిటుల - కట్టడి బెట్టందగునే......అక॥

4. వ. అనుబంధము.

శశి—

ఆనందభైరవిరాగము — ఏకతాళము.

ప॥ పరమేశా! భక్తపోషా!! పాపవినాశా!!! ప॥
అ॥ ప॥ (శ్రీ)పరమేశా! చిన్మయరూపా
ఘోరకష్టము లంతరింపంజేయవె దయ॥ (శ్రీ)।

చ॥ 1. కనికర మింతైన లేక - జనకుఁడు నను బాధపెట్టె
వినఁడు మనవి - కనఁడుధర్మము- ననుబ్రోవఁగ నీవెదిక్కు-॥ ప

2. బ్రతిమాలిన- పదములంటిన - లా-భంబది లేదిఁక
సతతము నిను శరణంటిని - స్వామీ ! దయజూడుము॥ పర॥

3. ఎన్ని జన్మములకైన - నన్నభిమన్యునితోఁ గూర్పుము
మన్ననమున తప్పులు - మన్నింపుము మ్రొక్కెద దయతో॥

5. వ. అనుబంధము.

అభి —

నాదనామక్రియరాగము—ఏకతాళము.

ప॥ వచియింపుమా - నా......బహిఃప్రాణముతో॥ వచి॥

అ॥ ప॥ సర్వసుగుణఖనికి—నా...శశిరేఖకు
యీజన్మమున నామాట—మరువమంటినని ॥

చ॥ 1. మనస్నేహము మఱచి పోమ్ము
మగువా మన కింతె ఫలము
ననుగూర్చి యెు బెంగపడకు
వినుమీ పల్కులంటినని ॥వచి॥

2. మారసుందరాంగీ—అభి
మన్యుఁడనెడి బావ
ధరణిఁగలఁడను మాట
తలపు నిడవలదంటినని ॥వచి॥

అభి—   6. వ. అనుబంధము.

సింధుకమాచిరాగము—ఏకతాళము.

ప॥ లేదా ! నినుజూచు భాగ్య మింక నాకు ॥లేదా?॥

అ॥ ప॥ ఈ జన్మమధ్యమున నినుగూచు భాగ్యమింక నాకు ॥లేదా?॥

చ. 1. చిఱుతరాబాల్యమైతి-చిటికెలోఁ దెగ తెంపుజేసి
యురుతరాటవి బడియుంటి—మరల నినుజూచుప్రాప్తి ॥లేదా?॥

2. తొల్లిటి యనురాగమెల్ల—దూరమయ్యెమనకక్కట !
మరలగలసి మనముసు-ఖంచుభాగ్యము మనకు ॥లేదా?॥

3. నీజనకు కింకమనపైనకరుణ రాదా? మనమిక
సర్వసౌఖ్యములదేలు—కాలమింకరాదా ?॥లేదా?॥

7. వ. అనుబంధము.

సుభ—   ముఖారిరాగము—ఆదితాళము.

ప॥ అయ్యో! దిక్కెవ్వరింక నా ॥కయ్యో॥

అ॥ ప॥ ఈయుగాద్రిటవిలోన మమ్ముగాచుటకు ॥నయ్యో

చ॥ 1. కూరదనుజుఁడెవఁడో—నా
కొడుకును గొలియింపన్
జేరి బోరుచుండె దయను ర
క్షించువారలెవరు లేరె ?॥ అయ్యో! ॥

2. అయ్యో ! దిక్కెవ్వరింక నాకీ
యుగాద్రిటవిలోన మమ్ముగాచుటకు ॥అయ్యో॥

## 8. వ అనుబంధము.

ఘటో—

### ధన్యాసిరాగము—ఏకతాళము.

ప॥ ఇదె పోయెదన్ - ద్వారకాపురికి నే ॥ఇదె॥

అ॥ ప॥ ఈపెండ్లి యెట్లగునో జూచుటకు నే॥ ఇదె॥

చ॥ 1. అరివైరుల జెండాడెద - మరదలి నేరక్షించెద
సురుచిరముత మ్ముకిచ్చి - పెండ్లిగావింపఁగనే॥ ఇదె॥

2. బలరామునుగర్వంబు - తొలగించెద చిటికలోన
అలుగకుకన్యకనిచ్చెద - ననియనిపింపగ నాకుణంబె॥ ఇదె॥

3 శ్రీరమాధవుని - కరుణసహాయ్యముగా
యీయత్నము జయమందును గావుననే॥ ఇదె॥

---

## 9. వ. అనుబంధము.

దేవ—

### సుకల్యాణిరాగము—ఏకతాళము.

ప॥ ఇటులనఁదగునా? తనయా! నీ॥ఇటు॥

అ॥ ప॥ తగనివగల బొగులుచునీ॥ ఇటు॥

చ॥ 1. మనమున నీవిటు - వనఁటఁబడుచు నెన్ని
దినములు కృశించిన వి - ధివ్రాలు తప్పదమ్మ॥ ఇటు॥

2. కనుఁగొనయాల - క్ష్మణుఁడైనను నీ
కనువర్తనుఁడౌ - నన్నిటఁ దల్లిరో॥ ఇటు॥

3. బావ యభిమన్యునిటు - భావమునం దలచుచు
భావజుఁడాలక్ష్మణుని . వరియింపక నీ॥ ఇటు॥

## 10. వ. అనుబంధము.

మా-శ—

ఖిల్వారాగము— ఏకతాళము.

ప॥ దయరాదా? నామీద - నీ దయరాదా? ॥నామీద॥

అ॥ ప॥ దయరాదా? సుతనుగానా?
ప్రేమలేదా? యిదిమరియాదా?॥ దయ॥

చ॥ 1. కన్నపుత్రికయనేఁడి ప్రేమయె
మన్ననమును బోనాడితివే
నిన్నెన్నివిధముల బ్రతిమాలినదయ
యన్నది జూపవిదేమి పాపము॥ దయ॥

2. నిన్నెన్నద - నీపదములపై నే
గ్రన్నన వ్రాలుచు మ్రొక్కెద - నను
మన్నించుము - దయజూడుము
సన్నుతగుణాఢ్య - సాదరముననను॥ దయ॥

---

## 11. వ. అనుబంధము.

పూరికల్యాణిరాగము—మిశ్రగతితాళము.

ప॥ బ్రాహ్మణునకు - వందనమా?

మిశ్ర॥ పప్పుదినుచు - రణమన్న పారెడి॥ బ్రాహ్మ॥

దురితము॥ బ్రాహ్మణుఁడని మ్రొక్కుము
ననుగావగ - రమ్మని - మ్రొక్కిన
గనియోర్వ - జాలఁడీ - కర్ణుఁడు॥ బ్రా॥

---

## 12. వ. అనుబంధము.

అశ్వ—

వసంతరాగము — జంపెతాళము.

ప॥ ఛి, ఛీ, కర్ణా! పేలకురా! ఛి, ఛీ॥

అ॥ ప॥ ప్రేలిన - నాలుక - జీల్చివై చెదనిఁక॥ ఛి ఛీ॥

చ॥ 1. బ్రాహ్మణునకు మ్రొక్కరాదె
సూతకులాపసదునకు మ్రొక్కనలెనె
పప్పుదిని పారెడి పాఱునిపై నీ
బాహుబలము జూపింపుము శక్తియున్న॥ ఛి ఛీ॥

దురితము—మాటలువిని - పోటరివని - మగిడిపోను
నీటుగు బాహుల - తీటవదల్చెదవా- చాటూరమ్ము ప్రేలకఁ ఛిఛీ॥

## 13. వ. అనుబంధము.

హిందూస్థాని తోడిరాగము—ఏకతాళము

సుభ—

ప॥ ఏలనో మన ఘటోత్కచుండు

అ॥ ప॥ యింతదనుకరాడయ్యో - నాకేమిటో పదయ్యో సోదరీ॥ ఏ॥

చ॥ 1. ద్వారకలో యేమిచిక్కు - తటస్థించెనో మనవానికి
వైరులెల్ల నచటఁగలరు - క్రూరులువారెల్లనయ్యో॥ ఏ॥

2. వేలకొలఁది యోధులుగల - కౌరవాధములతో
చాలగలఁడె మనవాఁడు - సరగునవారల ఢీకొన॥ ఏ॥

3. బాల శశిరేఖమన - వానికిగన్పడెనో లేదో
జాలముసేయఁగ యేహేతువో తెలియదు। ఏ॥

14. వ. అనుబంధము.

ఘటో—

దేవగాంధారిరాగము—ఏకతాళము

ప॥ దేవా! నందనందనా!

అ॥ ప॥ నీ కరుణకు నావందనంబు॥ దేవ॥

చ॥ 1. నీదయయొక్కటి గల్గుటచేతనే
నిక్కము వైరులగెల్చితి దేవా!
కోర్కె నెరవేర్చుకొంటి
క్రూరులదండించితి॥ దేవా॥

2. ఈ శశిరేఖను రక్షించితి
మఱదలిగా జేసికొంటి
యిన్నిటి కరయగ నీదయ
యేమూలముగాదొకో। దేవా॥

15. వ అనుబంధము.

ఫరజురాగము—ఏకతాళము.

శశి—

ప॥ తరమే - ఈవిలాసమెఱుగ

అ॥ ప॥ ఈజగతిలో నెటువంటి వారికైన॥ దరమే॥

చ॥ 1. ఆతనికరుణ యొక - టలవడునరులకు
యేతరినైనను బాధ - లంటుటెట్టులిక॥ తర॥

2. నిండారుభక్తిమెయి - నీసు నర్చించిన
మెండైనసంపద - లుండకపోవునే?॥ తర॥

